

DBN FILMS
డి.బి.యన్ ఫిలిమ్సు
ప్రైవేటు మాష్టారు
డైరక్షన్. కె.విశ్వనాథ్ బి.ఎస్.సి.
కథ ముళ్లపూడి వెంకటరమణ. సంగీతం కె.వి.మహదేవన్

# ఉత్తరాలు

## వినాయకచవితి సంచిక

8—9—1967 సంచిక ముఖచిత్రం 'గణపతి' పత్రికకు ఆకర్షణీయంగా వుంది 'ముద్దాచిట్టి బాబు' గారి 'నీవేగతి గణపతి!' చాలాబాగుంది కోసం నాలుగుయిదు వారాలయినా వెంటవెంటనే చదివాను సీరియల్స్ రెండూ బాగున్నాయి చక్కని సీరియల్స్ అందిస్తున్న మీకు కుమా అభినందనలు

నరశింహాచార్యులు ... కర్నూలు)

* * *

ముఖచిత్రం నుండి ఆఖరు పుట వరకూ మేము ఆశించినదానికంటే మరెంత అందంగా లేదు 'వినాయక చవితి ప్రత్యేక సంచిక' పేరుకు హాస్య సంచిక— హాస్యం శూన్యం— మరీ పేలవంగా వుంది కార్టూనులు నవ్వు పుట్టించక కన్నీళ్లు కురిపించేలా వున్నాయి యిక కథలు అవికథలే

డి జగదీష్ బాబు, (గుంటూరు)

## న్యూఢిల్లీలేఖ

తేది 8—9-1967 పత్రికలో శ్రీకృష్ణగారి న్యూఢిల్లీలేఖ చదివిన తరువాత వెంటనే ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది.

శ్రీ కృష్ణగారు తమ లేఖలో విదేశ క్రిస్టియన మిషనరీలు ఇండియాలో చేసే 'సేవ'ను తెగపొగిడారు బహుశః శ్రీకృష్ణగారికి ఈ విషయంలో మన ప్రభుత్వం అనుసరించే విధానం అర్థంకాలేదనుకుంటాను అస్సాములోను తదితర ప్రాంతాలలో నున్న క్రిస్టియన్ మిషనరీలను దేశంవిడిచి వెళ్లమని మన ప్రభుత్వం కోరిందికాని శ్రీ కృష్ణగారు వ్రాసినట్లు దేశంలోని మిగతాప్రాంతాలలోని క్రిస్టియన్ మిషనరీలను కూడా వెళ్లిపొమ్మనలేదు క్రైస్తవమతోద్ధారకులమని చెప్పుకుంటూ నాగాలనే ఆటవిక జాతివారిని దేశద్రోహచర్యలకు ప్రోత్సాహమిస్తూ 'ఇండిపెండెంటు నాగాలాండ్' అనబడే 'క్రైస్తవస్థాన్' కోసం పాటుబడే విదేశ క్రిస్టియన్ మిషనరీలను శ్రీ కృష్ణగారు పొగడుట చాలా బాధాకరంగా ఉంది,

విదేశ మిషనరీలు బీహారు క్షామమును అవకాశంగా తీసుకొని అనేకమంది క్షామబాధితులకు తిండి ఎర చూపించి బలవంతంగా క్రిస్టియన్లుగా మార్చేస్తున్నారన్న సంగతి పార్లమెంటులో వినవచ్చిందని శ్రీకృష్ణగారికి తెలియదనుకుంటాను 'క్రైస్తవ మిషనరీల తరఫున నేనువాదించడములేద'ని అంటూనే వారితరపున వకాల్తా పుచ్చుకొని అర్థంలేని వ్యాసం వ్రాశారు శ్రీకృష్ణగారు ఇకముందు ఇటువంటి వ్యాసాలు ప్రచురించవద్దని నా మనవి

ఏకం గోవింద్‌రావ్ (రాజమండ్రి)

# కింగ్-సైజు ❋ పొదుపైనది ❋ గులాబీల సువాసన



8-9-67 సంచికలో 'న్యూఢిల్లీ లేఖ' చదివాను. చదివి తర్వాత ఇంత మంచి వ్యాసం రచించిన 'శ్రీ కృష్ణ' గారిని అభినందించకుండా ఉండలేక పోతున్నాను. భారతదేశానికి క్రైస్తవ మిషనరీలు చేసిన అమూల్యమైన సాంఘిక సేవను విస్మరించి, ఈనాడు వారిపై నేరాలు మోపుతూ దేశ బహిష్కృతులను చేయుటలో మన దేశీయుల సంకుచిత మనస్తత్వాలు వెల్లడి అవుతున్నవి. ఈనాడు మనదేశములో బయలుదేరిన సాంఘిక సేవాసంస్థలు, మిషనరీ వారు చూపిన బాటలో రూపొందినవేగా! సాంఘికంగా, విద్యా విషయకంగా ఆరోగ్యపరంగా, మిషనరీలు మన దేశానికి చేసిన అమోఘమైన సేవను మరచిపోయి ఇప్పుడు వారిని దేశం నుండి పొమ్మనటం కృతఘ్నత కాదా!

● దేశ సేవకులమని చెప్పుకొనే కొందరి పెద్ద మనుష్యుల సంకుచిత తత్వాన్ని — మత దురభిమానాన్ని — ఇంత చక్కగా వర్ణించి, నీతిని, నిజాయితీని చూపారు శ్రీ కృష్ణ. హేట్స్ ఆఫ్ టు యూ శ్రీ కృష్ణాజీ!

శ్రీమతి బి. ప్రేమలీలారావ్ (రాజమండ్రి)

* * *

8-9-67 శ్రీకృష్ణగారి ఢిల్లీలేఖ విపరీత పోకడలో ఉంది. 'మత సంబంధమైన వైషమ్యాలకి నేను తలొగ్గడం లేదు'' అంటూనే ముస్లిముల మీద దుమ్మెత్తి పోసారు. వారి దృష్టిలో జన సంఘం వర్ణహిందూ మతోన్మాదుల, హిందీభాషోన్మాదుల మాత్రమే. వారి దృష్టిలో క్రైస్తవ మిషనరీలు మాత్రమే ఈదేశంలో పీడిత ప్రజల కష్టాలను బాపుతున్నాయి. కాని ఈ సహాయాల వెనక ఎంత కరుడు గట్టిన స్వార్థమున్నదో ఎందుకు వ్యక్తీకరించ లేదు?

'రామకృష్ణ మిషన్ తప్పిస్తే జనసంఘ దగ్గర నుంచి ఏ ఇతర హైందవ సంస్థ బీహారులోని మనుష్యుల్ని కాపాడడానికి ముందుకురాలే' దన్నారు. ఈ విషయాన్ని బహుశా ఢిల్లీనుండి వ్రాయుటవల్ల వారికి బీహారులో జరుగుతున్న సహాయ కార్యక్రమాల పూర్తి వివరములు తెలియవని అనుకుంటున్నాను.

లేకపోతే ఢిల్లీకి 1600 మైళ్ల దూరంలో నున్న అనకాపల్లిలో నున్న కొంతమంది జనసంఘం ద్వారా రా. స్వ. సే. సం. ద్వారా నిధులు వసూలు చేసి అకాల పీడిత ప్రజాసహాయక సమితి బీహారుకు పంపిన సంగతి వారికి తెలిసి ఉండదు. ఈలాగే దేశంలోని నలుమూలలనుండి అనేక లక్షలరూపాయలు వసూలు చేసి, బీహారు ప్రజల సంక్షేమానికి సహాయ పడిన సంస్థలేన్నైనా ఉన్నాయంటే వాటిలో ప్రముఖమైనవి జనసంఘం, ఆర్ ఎస్ ఎస్ లు మాత్రమే.

'దేశాలు సహాయం పేరిట పంపిన గోధుమలు పాలపిండిలతో మత మార్పిడులు చేస్తున్న ఈ విదేశీ క్రైస్తవ మిషనరీలు నాటిక డబ్బుగా ఉన్న పంచమాంగదళాలు వారి ఉద్దేశాలను మార్చుకోటం ఈదేశ భవిష్యత్తుకు ఎంతైనా మంచిది.

# ఉత్తరాలు

ఈ దేశము అన్నా ఈ ధర్మము అన్నా ఈ సంస్కృతి అన్నా గౌరవించలేని వ్యక్తులు సాధువులు ముసుగున సాధువులనక పోతే పూజనీయులైన సాధువులని ఎలా అంటారు? ఈ సాధువులే లేక పోతే ఈ భారతీయ ధర్మం, భారతీయ సంస్కృతి కాల గర్భంలో కలిసి పోయి ఈనాటికి ఈ భారత దేశము కొన్ని పాకిస్తాన్లుగను, కొన్ని నాగాలాండులుగను కొన్ని చైనా స్థానులుగను మరియు కొన్ని కమ్యూనిస్టు స్థానులు అయ్యుండేవి. అన్న విషయం గుర్తించమని కోరుతున్నాము.

బద్ది కృష్ణవేణి, బద్ది భాగ్యవతి (అనకాపల్లి)

## కథలు

1-9-67 సంచికలో 'ఎదురుచూసిన క్షణం' నిండుగా వుంది ఇందిర, ప్రసాద్ పాత్రల్లో — కథాముగింపులో ఇందిర ''కలంకోసి ప్రసాద్ కు ప్రక్క నూతన వధువు పేరుకు సౌభాగ్యవతి ఇందిర అనికాదు చేర్చి బలంగా హృదయానికి హత్తుకొనే సన్నివేశం — కథలో ఇందిరపాత్రకుండే సానుభూతిని క్షోభింపుయుండేవేమోననిపిస్తుంది — సౌభాగ్యవతి వ్రాసిన 'సాగుతున్న యాత్ర' చాల చక్కగా — సహజంగా వుంది. రచయిత్రికి నా అభినందనలు.

అడబాల భాస్కరరావు, (బిలాస్పూర్)

* * *

ఎ. సర్వేశ్వర్ రావుగారి 'వర్షించని మేఘాలు' కథ చదివాను. చాలా బాగుంది. ఇంత ఉత్తమ కథ రచించిన రచయిత గారికి, నా హృదయపూర్వక అభివందనములు.

కాటేపల్లి రజీకృష్ణ (కొత్తగూడెం)

* * *

''ఎదురు చూసిన క్షణం'' చదివిన తర్వాత హృదయాన్ని ఏదో తెలియని బాధ ఆవరించింది. అమాయకమైన ఇందిర ఆశలు అడుగంటడానికి తండ్రి రాజారావే కారణమనిపిస్తుంది. ''కనీసం తనకు తల్లైనా వుంటే తనమనస్సు విప్పి చెప్పుకోగల్గేది'' అనే వాక్యం పదే పదే హృదయాన్ని కలచివేస్తుంది. రాజారావు లాంటి తండ్రులు ఆడపిల్లల్ని కనడానికనర్హులనిపిస్తోంది!

జ్యోత్స్నారాణి, (పరసారావుపేట)

## కార్టూన్

15-9-67 పత్రిక 37వ పేజీలో 'కరెంటు' మీద వేసిన కార్టూను వాస్తవానికి చాల దూరంగా యున్నది. ఈ రోజులలో కరెంటు చాల తరచుగ ఫెయిల్ అవుచుండవచ్చునుగాని, సినిమా హాలులో జనానికి గడ్డాలు, మీసాలు పెరిగి పంతకాలము 'కరెంటు' రాలేదనడం బాగుగా లేదు. ఆ పాడు సినిమా కోసము జనము రోజుల తరబడి హాలులోనే కూర్చున్నారనడం అంతకన్నా నటబుగా లేదు. ఇక ముందైనా వాస్తవానికి సన్నిహితంగా యుండే కార్టూన్సు వేస్తారని ఆశిస్తున్నాను.

పద్మజ (హైదరాబాద్) ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 29-9-'67
ప్లవంగనామ సం॥ భాద్రపద మాసం బ॥ దశమి

సంపుటము 60 సంచిక 4

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11 20 |
| 3 మాసముల చందా | 5 60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
'గొప్పవారి గోత్రాలు' లో లక్ష్మి

# అగ్రస్థానం వహించిన భాషావివాదం - అడుగున పడిపోయిన అత్యవసర పరిస్థితి

ప్రప్రథమ ప్రధానమంత్రి గారయిన పండిట్ నెహ్రూగారు గొప్ప లౌకికుడు. ప్రజల మనస్సును ముఖ్యమయిన వాటిమీదనుంచి అనవసరాలకు మళ్లించడంలో ఆయన తెలివి తేటలన్నీ చూపించేవారు అలానే వారి కుమార్తె శ్రీమతి గాంధీ ఒక ఘన కార్యం చేశారు ఆర్థిక రాజకీయరంగాల్లో భారత దేశం అత్యంత క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొంటున్న సమయం ఇది అటువంటప్పుడు ప్రతి విషయంలోనూ ఎంతో జాగ్రత్త వహించాలి శ్రీమతి గాంధీ 'మేళం'లోని డాక్టర్ టి సేన్ గారు రెండేళ్ల క్రితం రగుల్కొన్న నిప్పులో మళ్ళీ ఆజ్యం పోశారు. దేశంలో అత్యవసర పరిస్థితులన్నింటినీ భాషా వివాదం అపహరించి వేసింది. కేంద్ర మంత్రుల్లో ప్రత్యక్షమైన భేదాభిప్రాయాలు వచ్చేశాయి. తత్ఫలితంగా విద్యామంత్రి చాగ్లాగారు రాజీనామా ఇచ్చారు.

కేంద్రంలో అధికారంకోసం ప్రాకులాట ఒక ఎత్తు, మొరార్జీదేశాయ్‌గారి హిందీ వ్యామోహం మరో ఎత్తు మొరార్జీగారి వైఖరి చూస్తుంటే, భవిష్యత్తులో ఎప్పుడయినా ప్రధాని అయ్యే గీత ఆయన చేతులో వుందనుకుంటే దానిని చెరిపేసుకుంటున్నారేమో అనిపిస్తున్నది ఇప్పుడు లోక్‌సభలో వున్న మెజారిటీ ప్రకారం, వారి రాజ్యాంగ విధానం ప్రకారం ఎంతమంది ప్రధాన మంత్రులయినా హిందీవర్గంలోనుంచే రావాలనేది ఒక ఆచారం! భారతదేశం సమైక్యంగా వుండాలనుకుంటే దక్షిణాదివారిని సంతృప్తిపరచగల ప్రధానమంత్రి కావాలి ఈవేళ ఉన్న పరిస్థితులదృష్ట్యా ఆ అదృష్టాన్ని మొరార్జీదేశాయ్‌గారు కోల్పోయారు.

ఒక వివాదంఉంది అది, రాజ్యాంగాన్ని మార్చితీరాలి అనేది ఇటువంటి ఆందోళనే రెండేళ్ల క్రితం లేచింది అప్పుడు లాల్ బహదూర్ శాస్త్రిగారు కరిగించుకున్నారు. నెహ్రూ గారు వాగ్దానమిచ్చినట్టుగా చట్టాన్ని సవరిస్తామని ఆయన హామీ ఇచ్చారు బడ్జెట్ సెషన్‌లో భాషాబిల్లును ప్రవేశపెట్టారు దానికి హిందీవాదుల నుంచి తీవ్రమైన ప్రతిఘటన వచ్చింది అంతే, దాని ముఖాన్ని చూసిన నాథుడు లేడు. పేటెంట్సుబిల్లు, అధికారంబిల్లు, ఆ బిల్లూ ఈ బిల్లూ స్థానం సంపాయించుకున్నాయి!

ఒకప్రక్క డాక్టర్ త్రిగుణసేన్‌గారు విద్యని ప్రాంతీయం చేసేద్దామని సంకల్పించుకున్నారు హిందీ ప్రాంతీయులు



సెప్టెంబర్ 15 న శ్రీ అన్నాదురయి 59 వ జన్మదినం

శుద్ధంగా హిందీని ఏలాగూ నేర్చుకుంటారు. హిందీని 'లింకు' భాషగా చేసి, దానికి భారత దేశ అధికార భాషగా గుర్తింపు నివ్వాలని శ్రీవారి తలంపు ఇంగ్లీషును తక్షణం తొలగించుదామని జనసంఘం ఉబలాట పడుతున్నది అలానే వారి సోదరులుకూడా అనుకొంటున్నారు ద్రవిడ మున్నేట్రకళగం, విద్యావేత్తలు, శాస్త్రజ్ఞులు, పౌరులు అంతా కలిపి ఇంగ్లీషును వదలడానికి ఒప్పడంలేదు. 'హిందీనిగనక మా నెత్తిమీద పెట్టడానికి యత్నిస్తే చూస్కోండి మా తడాఖా' అంటూ కేరళ ముఖ్యమంత్రి హెచ్చరించారు.

హిందీని రుద్దడం విషయంలో శ్రీమతి గాంధీ అసలు రంగులు బయటపడ్డాయి ఆమె ఒక సెంట్రల్ హిందీ కమిటీని స్థాపించారు. దానికి అధ్యక్షస్థానం వారిదే! శ్రీయుతులు మొరార్జీ దేశాయ్, వయ్ బి చవాన్, త్రిగుణసేన్, కె కె షా, పి గోవిందమీనన్, గంగాశరణ్, బి సుబ్రహ్మణ్యం, సేఠ్ గోవింద్ దాస్, ప్రకాశవీర్ శాస్త్రి ఉమాశంకర్ దీక్షిత్, వాజ్‌పేయ్ ఆదిగాగల ప్రభృతులంతా అందులో సభ్యులు భారత ప్రభుత్వానికి హిందీ సలహాదారుడుగా ఉన్న ఆర్ డి సిన్హా దిన్‌కర్ దానికి కార్యదర్శి మనదేశంలో ఎంతోమంది మంత్రులున్నారు వారంతా హిందీని ఎలా దేశవ్యాప్తం చేస్తున్నారో చూడడమే కమిటీ ముఖ్యోద్దేశం! కమిటీ కార్యస్థానం న్యూఢిల్లీలోనే వుంటుంది

దక్షిణాది వారికి మేము ఏమీ అన్యాయం చేయడం లేదు చూశారా, అంటూ మద్రాసు ముఖ్యమంత్రి సి యన్ అన్నాదురైగారికి శ్రీమతి గాంధీ చెప్పిన సమాధానం ఇది.

## గందరగోళం

ఆర్థిక స్తంభన, కార్మికుల యుద్ధం, వరదలు అన్నీ ఈ గందరగోళంలో మునిగిపోయాయి. ప్రయోజనం లేదనుకుని

# న్యూఢిల్లీ లేఖ

బెంగాల్ బల్క్ సట్టు జరిగినటువంటి ఇందిరా గాంధీగారు సెప్టెంబరు పదకొండున భాషా విధానంమీద ఒక గొప్ప ప్రసంగం చేశారు భారత విశ్వవిద్యాలయాల వైస్‌ఛాన్సలర్ల సమావేశానికి నాంది వాచకం అది డా టి సేన్‌గారుకూడా ఒకప్పుడు వైస్‌ఛాన్సలరే ఈ కమిటీ ఆదర్శంలో లోతు ఎంతో తెలుసుకోడానికి అయనే ఒక ఉదాహరణ!

భాషా వివాదం మళ్ళీ తలఎత్తడానికి కారణమేమై వుంటుందో ఎవరూ చెప్పలేక పోతున్నారు ఇప్పుడు మనదేశంలోని మానవ కోటి తలమున్కలుగా ఆర్థిక బాధల్లో ఈదులాగుతున్నది ఈ బాధల్ని మరిచిపోవాలంటే, వాటిని తలదన్నే మరో గొప్పవ్యాపకం కావాలి ప్రజల మనస్సుని మళ్ళించి, కప్పిపుచ్చడం కోసమే ఈవివాదం లేచింద. ఎందుకనుకోకూడదూ?

ఈ వారం శ్రీమతి గాంధీ మరో 'రవుండ్ టేబుల్'కి గుర్తింపు ఇచ్చారు అది భారత శాస్త్రజ్ఞులకి సంబంధించినది శాస్త్ర పరిశోధన వ్యవహారాలకోసం వేరే మంత్రివర్గం వుండాలన్నారు కొందరు శాస్త్రజ్ఞులు వారి రంగంలో అంగ్లాభివృద్ధికోసం మరింత ఎక్కువగా దోహదం చేయాలనికూడా శాస్త్రవేత్తలు కోరారు వైద్యవృత్తిలో నివారం దరికి మరో 'రవుండ్ టేబుల్' వస్తుంది ప్రధానమంత్రిగారి మొట్టమొదటి రవుండ్ టేబుల్ యువకులయిన పారిశ్రామికవేత్తలతో ప్రారంభమయింది అందులో పాల్గొన్న వాళ్ళంతా మూడేసి మాసాల కొకసారి మళ్ళీ మళ్ళీ కలుసుకోవాలని కంకణాలు కట్టుకున్నారు ఈ లోపులో మరికొన్ని రవుండ్ టేబుళ్ళ తయారయినయ్ దానితో పాత నీరు కొట్టుకుపోయింది ఇప్పటి శాస్త్రవేత్తల సమావేశానికీ అదే గతి!

వైద్య వృత్తుల వారికి సంబంధించిన రవుండ్ టేబుల్‌తో ఒక వలయం పూర్తవుతుంది అప్పుడు శ్రీమతి గాంధీగారు పరిపాలనలోను, విద్యలోను, శాస్త్రవిజ్ఞానంలోను, వైద్యంలోను అన్నిటిల్లోను కడుసమర్థులని, సకలపూజ్యులని ప్రజలకు అవగతమైపోతుంది!

భారత ప్రజల దృష్టిలో శ్రీమతి గాంధీ ఎలా ఎంచబడుతున్నారో దీనివల్ల అర్థమవుతుంది ఆమె కార్యాలయాన్ని అధివసించినప్పటి నుంచి పత్రికా సమావేశాలకి కొదువలేదు అవన్నీ పూర్తిగా ఎదురు తిరిగాయి అందుకు కారణం దేశం ఎదుర్కొంటున్న సమస్యల్ని శ్రీమతి గాంధీ అర్థం చేసుకోలేక పోవడమే వాటివల్ల అంతగా పేరు రాదని తెలుసుకున్న శ్రీమతి గాంధీ రేడియోలో మాసవారీ ప్రసారాలు మొదలు పెట్టారు వ్యక్తికి వ్యక్తికి మధ్య గోష్ఠి అని వాటికి పేరు పెట్టారు ఇవి కూడా ఆశించినంత ఫలితాన్ని ఇవ్వలేదు అందుచేత విరమించుకున్నారు 'ఉపమంత్రుల్ని ఎదుర్కొంటున్న సమస్యల గురించి ప్రధానమంత్రి ప్రశ్నిస్తారు' అని ఒక శుభోదయాన తెలిసింది ఉపమంత్రులంతా కలిశారు కాఫీలు టీలు సేవించి బిస్కట్లు తిని బ్రేవ్ మని త్రేన్చి ఎవరిమట్టుకు వాళ్ళు విడిపోయారు! అందువల్ల జరిగింది ఏమీ లేకపోయింది దీనినే మరోవిధంగా చెప్పుకోవచ్చు ఉపమంత్రులకి కూడా 'దోపిడీ'లో స్థానం కల్పిస్తున్నాం, మేము ఒక్కళ్ళమే అనుభవించడం లేదు అనవచ్చు! వారిలో ఒకరు లండన్‌లో కాఫీ కాన్ఫరెన్సుకి వెళారు, మరొకరు యూరోప్‌లోని కాఫీ

(64 వ పేజీ చూడండి)



# విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 17

[illegible] కెన్నెడీ బృందం ప్ర. బెతెస్డాకి రాగానే అక్కడ ఒకరకమయిన 'నాట్యం' ప్రారంభమయింది చిన్నచిన్న గుంపులు ఏర్పడ్డాయి, విడిపోయాయి, మళ్ళీ కలిశాయి, జంటలు ఏర్పడి విడిపోయాయి, ఒకళ్ళ నొకరు దొంగచాటుగా చూసుకున్నారు: ఎవరయినా అతిగా బాధపడుతున్నట్లు కనిపిస్తే వెంటనేవారికి ఉపశమనం కలిగించటానికి ప్రయత్నించేవారు, కొందరుమాత్రం విడిపోయి ఒంటరిగా ఉండిపోయారు ఇవిలిన్ లింకన్ అధ్యక్షుడి తోలుసంచీ పట్టుకుని కిటికీ పక్కనే నుంచుని ఏదో ఆలోచనలో మునిగిపోయింది బాబీ కెన్నెడీ టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాడు - చనిపోయిన ఆఫీసర్ టిపిట్ భార్యతో, లండన్‌లోని ( లీరాడ్జివిల్ తో, నెల్లీకాన్లల్లీతో సార్జెంట్ ప్రీవీర్‌తో

డేవ్‌పవర్స్ అందరికీ పానీయాలు ఆర్డర్ చేశాడు - సారాయం, కాఫీ బాబ్ కెన్నెడీ ఒక గ్రామఫోను తెప్పించమన్నాడు బెన్ బ్రాడ్లీ వద్దన్నాడు టోనీబ్రాడ్లీ వంక చూపిస్తూ, 'ఆమె వినదూ?' అన్నాడు కెన్నెడీ ఎవరినో గ్రామఫోనుకోసం పంపాడు అతను వెళ్ళాడు కాని తిరిగి రాలేదు

'భయంకర నాట్యం'లో కొన్ని విశేషాలు- ప్రతివొక్కరు ఎప్పుడో అప్పుడు శ్రీమతి కెన్నెడీని దుస్తులు మార్చుకోమన్నారు ప్రతి వక్కసారీ ఆమె తల అడ్డంగా ఆడించింది కొందరు ఆమె ప్రశాంతికోసం మత్తుమందు ఏదయినా పుచ్చుకుంటే మంచిదన్నారు ఆమె అంగీకరించలేదు డా జాన్‌వాల్ష్ ఆమెని బలపరిచాడు 'వద్దంటే వదిలెయ్యండి కావలసినంత మాట్లాడి బరువు తీర్చుకోనివ్వండి'

ఆమె నిజంగానే చాలా మాట్లాడుతున్నది కారులో జరిగినదంతా జ్ఞాపకం ఉన్నంతదాకా చెప్పింది బెన్, టోనీబ్రాడ్లీలతో ఆస్పత్రికథ చెప్పింది కొడుకు పాట్రిక్ మరణంగురించి చెప్పింది రెండు మరణాల మధ్య ఏదో సంబంధం ఉన్నట్లు మాట్లాడింది అది ఆమెభావం దేశానికి హత్య వొంటరి మరణం మాత్రమే

'జాకీకి అధ్యక్షుడి అంత్యక్రియలు ఎలా జరగాలో తెలుసు అపస్వరాలు పనికిరావు' అన్నది శ్రీమతి ఆకిన్‌క్లాస్

బెతెస్డాలో ఈ భర్తృవిహీనకి తన కొత్తబాధ్యతలు బాగా తెలిశాయి లోపల ఏదో ఆవేశం పుట్టుకువచ్చిందని ఆమె తనే తర్వాత చెప్పింది కన్నీరుపెట్టుకున్న పామ్ టుర్నూర్‌ని వోదార్చింది 'అయ్యో పామ్ ఇప్పుడు నువ్వేమిచేస్తావూ?'

డేవ్‌పవర్స్‌కి ధయిర్యం చెప్పాలనే ఉద్దేశంతో, 'అధ్యక్షుడిగారి గదిలో ఏమి పెట్టాలి తెలుసా? ఊతకొలను! తర్వాత తనూ అధ్యక్షుడూ ఎలా ఈదేవారో చూపించవచ్చు డేవ్!' అన్నది నవ్వుతూ

బాబ్ కెన్నెడీ, కెన్‌వోడాన్నెల్, లారీ వోబ్రయన్‌లతో జాన్సన్ ప్రమాణస్వీకారం గురించి మాట్లాడాడు తను విమానం మీదనే ప్రమాణం తీసుకోవాలని చెప్పలేదని మళ్ళీ అన్నాడు వారు ఆశ్చర్యపోయారు జాన్సన్ అధ్యక్షపదవిలో కాళీ రారాదని ఈపని చేశాడేమో అనే అనుమానం వారికి కలుగలేదు

ఇప్పుడు కెన్నెడీ కుటుంబానికి కొత్త పెద్ద అతను కొత్త వితంతువుతో కలిసి కొన్ని నిర్ణయాలకి రావాలి ఒక విషయంలో మాత్రం ఇద్దరూ ఏకీభవించారు అంత్యక్రియలు ఎవరికో సామాన్యుడికి వప్ప చెప్పరాదు

చర్చిలో పాల్గొనమని టోనీని పిలిచింది శ్రీమతి కెన్నెడీ టోనీబ్రాడ్లీకి ఇది బాధాకరమే అయినా తన బాధ అంత ముఖ్యమయినదికాదనీ ఆమె వెంటనే అంగీకరించింది, బాబీ కెన్నెడీవలెనే.

'ఎలా తట్టుకుంటోంది ఈ మనిషి?' అన్నది రహస్యంగా ఎతెల్ కెన్నెడీ

'ఆమెలో ఫ్రెంచి రక్తం ప్రవహిస్తోంది! అదీ ఒకపద్ధతి,' అన్నాడు బెన్‌బ్రాడ్లీ 'ఆమె తనలోని విషాదాన్ని ఈ విధంగా బయటికినెట్టాలని చూస్తోంది'

7—30 [illegible] టరీ రాబర్ట్ మెక్నమరా వచ్చాడు కొంతసేపే ఉండవలసివస్తుందని కారులో భార్యని అక్కడే ఉండమని లోపలికి వెళ్ళాడు కాని శ్రీమతి కెన్నెడీ అతన్ని కొంతసేపు ఉండమన్నది అతను కిందకివెళ్ళి భార్యకి కొడుకుని బాయిస్కవుట్ సభలోనుంచి 8—30కి తీసుకురావాలని గుర్తుచేశాడు 'శ్రీమతి కెన్నెడీ దుస్తులు రక్తంతో తడిసిపోయి ఉన్నాయి భయంకరంగా ఉంది ఆమెకి ఎవరితోయినా మాట్లాడాలని ఉంది, అంతే ఆమెకోసం నేను ప్రశాంతంగా ఉండవలసివచ్చింది, ఆమె చెప్పినదంతా వినటం మంచిదనుకున్నాను ఇద్దరం వంటగదిలో కూర్చున్నాము నేను నేలమీదా, జాకీ ఒక చిన్న బల్లమీదా కొన్ని గంటలు గడిచాయి నేను ఆమెని తప్పితే మరెవరినీ పట్టించుకోనే లేదు తక్కిన వారిసంగతి నాకెందుకు, అనుకున్నాను వాళ్ళసంగతేమిటో వాళ్ళే చూసుకుంటారు,' అనుకున్నాడు శ్రీ మెక్నమారా,

చివరికి ఆమె అడిగింది 'నేనింక ఎక్కడ ఉండను?' 'ప్రభుత్వ నివాసం' ఇక కెన్నెడీ నివాసంకాదు జార్జిటవున్‌లోని ఇల్లుకూడా ఆమెదికాదు 1960లో అధ్యక్షుడు 'దానిని ఎందుకు అమ్ముకున్నట్లు? అని అడిగాడు తర్వాత ఎలాగూ సొంత ఇల్లుకావాలి కదా? కాని అది ఎనిమిది సంవత్సరాల తర్వాతిమాట ఇంతలో ఇంటిని అమ్మితేనే మంచిది తను మళ్ళీ ఆ ఇంట్లో ఆ గదిలో పడుకుని నిద్రపోగలదా? 'జాక్‌ని మరిచిపోలేను కాని అనారోగ్యపుటాలోచనలు పనికిరావు' అనుకున్నది ఆమె అంటే, తనేమిచెయ్యాలి? జార్జిటవుకే వెళ్ళిపోతుంది పాత చిరునామాకి (వీలయితే)

'దాన్ని మళ్ళీ కొనే ఏర్పాట్లుచేస్తాను,' అన్నాడు మెక్నమారా

కొన్ని పత్రికలలో శ్రీమతి కెన్నెడీ తర్వాతి ప్రవర్తనగురించి రాస్తూ ఆమె చాలా పెత్తనంచేసిందని సూచించారు కాని, ఆమె ఏపనీ తొందరపడి చెయ్యలేదు. అంతకి కొంత కాలంముందు తయారుచేసిన ఒక పుస్తకం

లోని సూత్రాలనిబట్టి తన కార్యక్రమాలని నిర్ణయించుకున్నది కేవలం సత్యంకాని కథ కొన్ని పత్రికలలో పడ్డాయి

అంతేకాక, అసలు చాలా ఏర్పాట్లు చేసినది రాబర్ట్ కెన్నెడీ తన వదినగారు బాధపడరాదని అధ్యక్షుడి నివాసంనుంచి జాన్ ఎఫ్ కెన్నెడీ వస్తువులు కొన్నిటిని తీయించి వేశాడు

స్టేట్ డిపార్ట్‌మెంట్‌కి చెందిన ఆంగీ డ్యూక్ అంత్యక్రియలని గురించి మాట్లాడుతూ ఊరేగింపునంటివి 'లౌకికంగా' (సెకులర్‌గా) జరిపితే ఎలావుంటుందని అడిగాడు అధ్యక్షుడు మతాన్నీ, ప్రభుత్వాన్నీ వేరుగా ఉంచేవాడు, 'సర్వీస్' వయిట్‌హవుస్ లోనే జరిపిస్తే ?—అన్నాడు డ్యూక్‌కూడా కాథలిక్ మతంవాడే తన సూచనకూడా హృదయ పూర్వకంగా చెయ్యలేదు కేవలం చర్చ ఒకటి ప్రారంభం కావాలని అతని ఉద్దేశం ఈ ఉద్దేశం నెరవేరింది అతని 'లౌకిక' సూచనకి చిరాకుపుట్టి సార్జెంట్ ష్రీవర్ విసుక్కున్నాడు — 'కుటుంబంలోని వాళ్లెం మత రహితమయిన అంత్యక్రియలకి ఒప్పుకోము !'

అయితే జాన్ కెన్నెడీ అధికారంలోకి రాగానే తనకి కాథలిక్ పక్షపాతాలు లేవని నిరూపించు కొనటానికి చాలా కష్టపడ్డాడు ఇదంతా మర్చిపోవడం తేలికకాదు అందుచేత, ష్రీవర్ కొన్ని ప్రత్యేకమయిన ఏర్పాట్లు చేయించాడు కెన్నెడీని కాథలిక్ గానే పాతిపెట్టాలి కాని, దేశానికి ముఖ్యాధికారి కాబట్టి, అన్ని క్రయిస్తవ శాఖల మతాధికారుల చేత ప్రార్థనలు జరిపించటానికి నిశ్చయించుకున్నాడు!

ఎందరో పాదరీలు సిద్ధంగా ఉన్నారన్నాడు జనరల్ టెడ్ క్లిఫ్టన్ కెన్నెడీ ఆదర్శాలు తెలుసుకున్నవారంతా తమకర్తవ్యం నెరవేర్చుకొనటానికి అక్కడ పోగయ్యారన్న మాట అతను కాథలిక్ అధ్యక్షుడు కాదు, అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు వారి అభిమానం అటువంటిది

అటార్నీ జనరల్ రాబర్ట్ కెన్నెడీ చిరాకు పెరుగుతున్నది రాత్రి 10 గంటలయినప్పటికీ తన సంస్కారాలు కొన్ని ప్రారంభంకూడా చెయ్యలేదు జీన్‌స్మిత్, అధ్యక్షుడికి ఇష్టమయిన సూట్‌లు, టయ్‌లు తీసుకురమ్మని జార్జి థామస్‌ని పంపింది కెన్ ఓడానెల్‌కి ఒక ఊహ కలిగింది 'జాకీ! ఆ ఉంగరం తీసుకువస్తాను !' అన్నాడు.

కింద శవాలగదిలో డా జార్జి బర్క్లీతో వెళ్లి చెప్పాడు అతను ఉంగరంతీసి పట్టుకువెళ్లాడు బాబ్ కెన్నెడీతో, 'నేనెవెళ్లి ఆవిడకి ఇస్తాను ఆవిడకి అందిసరని గట్టిగా తెలుస్తుంది,' అన్నాడు బాబ్ కెన్నెడీ మాట్లాడకుండా అతనికి దారిచ్చాడు బర్క్లీ ఉంగరం శ్రీమతి కెన్నెడీకి ఇచ్చాడు తనబాధ చెప్పుకొనటానికి ప్రయత్నించాడు

అసలు బర్క్లీకి తను కెన్నెడీ కుటుంబానికి సన్నిహితుడో కాదో తెలియలేదు డా జేనెట్ ట్రావెల్ పేరే వార్తాపత్రికలలో అధికంగా కనిపించేది బర్క్లీ నావిక దళానికి చెందిన వయిద్యుడు ప్రభుత్వం 'రాల్స్'లో ఇరుక్కుపోతూ ఉన్నట్లు కనిపించేవాడు ముందు సంవత్సరం శ్రీమతి కెన్నెడీకి పురుడు పోసుకోవలసి వచ్చింది డా బర్క్లీకి ఈ బాధ్యత వప్పచెప్తారేమో అనుకున్నారు అతను బెత్‌స్డా ఆస్పత్రిలో ఒక గది ఏర్పాటు చేయించాడు ఇది ఆమెకి నచ్చలేదు కోపం చేసుకున్నది అప్పటి నుంచి డా బర్క్లీ ఆమెకి దూరంగా ఉండేవాడు ఇప్పుడు తన విచారం వెలిబుచ్చటానికి తికమకపడ్డాడు శ్రీమతి కెన్నెడీది జాలిగుండె అవతలివారిని తేలికగా అర్థం చేసుకోగలదు డా బర్క్లీతో, ఆయన సానుభూతి తనకి ఎంత బలం ఇస్తున్నదో చెప్పింది తన కోటుజేబులో దాచిన ఒక ఎర్రపువ్వు తీసి అతనికి ఇచ్చింది ఆ పువ్వు డల్లాస్‌లో శవవాహనంలో తను కూర్చున్నప్పుడు డా బర్క్లీయే ఆమెకి ఇచ్చాడు

రాత్రి పదిగంటలు అయింది ఆస్పత్రిలో జనం పోగవుతున్నారు శ్రీమతి కెన్నెడీకంటిలో నీరులేదు కాని ఆమె ఏడుపుకి ఎంతో దగ్గరగా ఉన్నట్లు అందరూ గమనించారు. జాకీ కెన్నెడీ చాలా స్తబ్బుగా ఉన్నాడు



జె ఎఫ్ కెన్నెడీ

మెక్‌నమారా కెన్నెడీ రెండవ అధ్యక్ష పదవి కాలం గురించి మాట్లాడటం మొదలు పెట్టాడు 'మీరు రెండవ మంత్రివర్గంలో సెక్రెటరీ ఆఫ్ స్టేట్ అయ్యేవారుతెలుసా?' అని అడిగాడు చార్లీ బార్ట్‌లెట్ తనకి ఈ సంగతి అధ్యక్షుడే స్వయంగా చెప్పాడట డిఫెన్స్ సెక్రెటరీ తల ఊపాడు, నిదానంగా 'విధానం మాట ఎలాఉన్నా పరిపాలనలో తోడ్పడేవాడిని' అన్నాడు జాకీ తన విచారాన్ని కప్పిపుచ్చి అతిథులని సత్కరించటానికి ప్రయత్నించడం ప్రారంభించింది — ఈ రోజు గడవటం ఆమెకి ఇష్టంలేదా అన్నట్లుంది—అనుకున్నది మార్తా బార్ట్‌లెట్

ఇక వెళ్లేసమయం,అనుకున్నారుకొందరు శ్రీమతి కెన్నెడీ, ఇవిలిన్ లింకన్, నాన్సీటక్కర్‌మాన్, మేరీ గల్లాఘర్, పామ్ టుర్నూర్‌లని ఇంటికివెళ్లి కాసేపు నిద్రపొమ్మంది

'ఈ కొద్దిరోజులూ ఎలాగో గడపాలి,' అన్నది

'ఎలా?' అని అడిగింది మేరీ

'రెండురోజులు నిబ్బరంగా ఉందు, తర్వాత అందరం కూలిపోతాము'

ఇంకా అన్నది శ్రీమతి కెన్నెడీ 'నేను జాక్ వెళ్లేదాకా కదలను కాని, అంతా అయిపోయేదాకా ఏడవను'

'ఎందుకు వెళ్లటం?' అని అడిగాడు బాబ్ కెన్నెడీ కొందరు అతిథులని వారు ఏదో గొణిగి పారిపోయారు వోడానెల్, వోబ్రయన్, పవర్స్ మాత్రం శ్రీమతి కెన్నెడీ లాగే అధ్యక్షుడితోబాటే కదిలి వెళ్లదలచుకున్నారు ఎవరూ ఏమీ అనలేదు అంతా మవునంద్వారానే అర్థం చేసుకున్నారు

ఎవెల్ బీర్‌లు మరొకగదిలోకి వెళ్లారు జీన్ నిద్రమాత్ర పుచ్చుకున్నది డాక్టర్ వాల్ష్, మెక్‌నమారా, బాబ్ కెన్నెడీలు శ్రీమతి కెన్నెడీతో ఉండిపోయారు అప్పటికి ఆమె రెండురోజులుగా విపరీతమయిన శ్రమకి లోనైఉంది ఇంకా ఎంతో శ్రమకి తట్టుకోవాలి తట్టుకోగలదా? ఈ సందేహం అక్కడివారికి కలిగింది డాక్టర్ వాల్ష్ ఒక ఇంజక్షన్ గొట్టంలో 100 మిల్లిగ్రాముల 'విస్టారిల్' ఎక్కించి ఆమె వంక ప్రశ్నార్థకంగా చూశాడు ఆమె సందేహించింది 'కొంచెం ఇవ్వండి చిన్న కునుకుకి చాలినంత కాన్ని ఇంటికి చేరుకునే సమయానికి మెల

[illegible]

వాల్ష్ ఆమెకి ఇంజక్షన్ ఇచ్చాడు. ఆమెకి నిద్ర తప్పదనుకుని పక్కగదిలోకి వెళ్లి కుర్చీలో కూర్చుని నిద్రపోయాడు.

శ్రీమతి కెన్నెడీ పదినిమిషాలు ఆగింది. ఏమీ అవలేదు. సిగరెట్ల కోసం చూసింది. అక్కడ లేవు. పక్కగదిలోనుంచి వెళ్లింది. నప్పుడికి డాక్టర్ మేలుకుని ఆమెవంక ఆశ్చర్యంగా, అపనమ్మకంతో చూశాడు. ఆమె చిరునవ్వుతో సిగరెట్లకోసం మరొక గదిలోకి వెళ్లింది.

కింద శవానికి 'మేకప్' వేస్తున్నారు. 'ఒక వెయ్యిసంవత్సరాల తర్వాత ఎవరయినా శవపేటిక తెరిస్తే ముఖం సరిగ్గా ఉండాలి. వస్త్రాలు బాగా ఉండాలి' అన్నాడు శవపరీక్ష చేయిస్తున్న డాక్టర్ బర్క్లీ. కెన్నెడీ కుటుంబంవారు ఏ క్షణంలో ఏమి నిర్ణయిస్తారో చెప్పటం కష్టం అని అందరికీ తెలుసు.

డేవ్ పవర్స్ అధ్యక్షుడి బట్టలు ఎన్నుకున్నాడు - నీలం – నలుపు సూటు, నల్లటి షూలు, ముదురునీలం రంగుమీద లేత నీలం చుక్కలుకల టయ్, 'జె ఎఫ్. కె.' అని ఎంబ్రాయిడర్ చేసిన తెల్ల సిల్కు షర్టు. అయితే కెన్నెడీకి ఇటువంటివి కనిపించటం ఇష్టంలేదు కాబట్టి కోటు 'లేపెల్' మరుగున ఉండిపోయింది ఈ ఎంబ్రాయిడరీ. అతని జేబు రుమాలమీద అక్షరాలు కూడా కనిపించకుండా మడిచేవాడు. పవర్స్ కూడా అదేపని చేశాడు.

శ్రీమతి కెన్నెడీ సిగరెట్టు ముగించి, కాసేపు టెలివిషన్ చూసింది. అప్పుడు కన్నీరు కట్టలు తెంచుకునివచ్చాయి. మరి కొంతసేపు ఆగి వంటగదిలోకి వెళ్లింది. అక్కడ బాబ్ కెన్నెడీ, బాబ్ మెక్నమారాలు మాట్లాడుకుంటున్నారు.

మరది పోలీసు అధికారి టప్పిట్ హత్య తువు సంగతి చెప్పాడు. 'ఆమెతో మాట్లాడుతావా?'

ఆమె ఇష్టపడలేదు. కాని, బాబీ సాయు భార్యని తలుచుకుని ఆశ్చర్యపోయింది.

బాబీ టెలిఫోన్ చెయ్యటానికి మరొక గదిలోకి వెళ్లాడు. ఆమె శవపేటిక సంగతి ప్రస్తావించింది మెక్నమారాతో. 'శవపేటిక మూసిఉంచటం నాకు ఇష్టం. తెరిచి పెట్టటం మంచిదికాదు!'

'అలా కాదు [illegible]



చూడాలని ఉంటుంది కదా!'

'పరవాలేదు! చాలా అసహ్యమయిన పద్ధతి తెరిచి ఊరేగించటం: జాన్ బతికి ఉన్న రోజులు జ్ఞాపకం వస్తాయి.'

ఇంతలో బాబ్ కెన్నెడీ వచ్చాడు. అతను కూడా మెక్నమారా చెప్పినదే చెప్పాడు. ఇది ఒక్క కుటుంబానికి సంబంధించిన విషయం కాదు. దేశం మొత్తానికి సంబంధించినది.

శ్రీమతి కెన్నెడీ ఇక అడ్డు చెప్పలేదు. వీ రిద్దరూ తన భర్తకి అత్యంత ఆప్తులు, 'బాధతోనే వారి నిర్ణయం స్వీకరించాను,' అన్నది. కాని, ఆమెకి నచ్చలేదు.

వయిట్‌హవుస్‌లో శ్రీవర్ కాప్టెన్ టాజ్వెల్ షెపర్డ్‌తో అన్నాడు: 'అధ్యక్షుడు ఏ క్షణమయినా రావచ్చు! ఆయనకి స్వాగతం చెప్పేందుకు ఎవరూ లేకపోతే ఎలా? ఇది గంభీరమయిన క్షణం! టాజ్, కొందరు సోల్జర్లని, సెయిలర్లని పోగు చెయ్యి! ఆయన వెంట నడిచివెళ్లాలి వీరు.'

17 నిముషాలలో పూర్తి డ్రెస్‌తో తయారయ్యారు ఒక నావిక దళంవారు.

జాన్ ఎఫ్. కెన్నెడీ వారి బరక్స్‌కి ఒక సారివచ్చి వెళ్లాడు. అప్వాల్డ్ ఒకప్పుడు ఈదళంలో ఉన్నప్పుడే తుపాకి కాల్చటం నేర్చుకున్నాడు. ఈ విషయాలు ఆదళంలోని వారందరికీ తెలుసు......

వయిట్‌హావుస్‌లో చిన్న నావిక దళ ప్రదర్శనం వంటిది జరిపారు అధ్యక్షుడికోసం.

బాబ్ కెన్నెడీ శవపేటిక ఉన్న గదిలోకి వెళ్లాడు. వెళ్లేముందు జాకీతో శవపేటిక మూత సంగతి తేల్చేస్తానన్నాడు.

గదిలోకివెళ్లి అక్కడ కాపలాకాస్తున్న వారిని ఒకసారి బయటికి వెళ్లమన్నాడు. వంటరిగా శవపేటికని సమీపించాడు. శవాన్ని చూశాడు. జాకీ చెప్పినదే సరి అనిపించింది అతనికి.

కాని, తను ఒక్కడూ ఈ నిర్ణయం తీసుకుంటే ఎలా? మెక్నమారా చెప్పిన దానిలోనూ నిజం ఉన్నది. జాన్ కెన్నెడీ ఒక స్త్రీ భర్త, కెన్నెడీ కుటుంబం వాడు—కాని అమెరికా అధ్యక్షుడు కూడా. హోడాన్నెల్, వోబ్రయన్‌లు శవపేటిక మూయ్యటం భావ్యం కాదన్నారు.

తడిసిన బుగ్గలతో బయటికి వచ్చాడు జాక్ [illegible]

అని వారి అభిప్రాయంకోసం అడిగాడు. ముందు శవాన్నిచూసి రమ్మన్నాడు. 'జాకీ మూత మూసి ఉంచాలంటున్నది' అన్నాడు.

మెక్నమారా, స్లెసింగర్, స్పాల్డింగ్, వాల్టన్, వాన్డెటక్కర్మాన్, మారిస్సీ, డాక్టర్ జోసెఫ్ ఇంగ్లిష్ లోపలికి వెళ్లారు. డాక్టర్, మెక్నమారా— వారిద్దరే అధ్యక్షుడిని ప్రజలకి చూపించవచ్చు ననుకున్నారు. 'అధ్యక్షుడు బాగానే కనిపిస్తున్నాడు; అయితే కొంచెం కుడివయిపుకి తిరిగి ఉన్నట్లుందేమిటి? తుపాకిగుండు దెబ్బవల్లనా?' అని అడిగాడు. (అంత్యక్రియలు జరిపేవారు శవాన్ని ఇలాగ కొంచెం పక్కకి తిప్పుతారు. మరీ వెల్లకిల్లా పడుకుంటే కృత్రిమంగా కనిపిస్తుందని వారి అభిప్రాయం.)

'ముందు బాగానే ఉన్నట్లనిపించింది. కాని, నా చూపు అంత బాగా లేదు. దగ్గరికి వస్తే మరీ మయినపు ఆకారంలాగ ఉంది! భయకరంగా ఉంది!' అన్నాడు ఆర్థర్ స్లెసింగర్.

స్పాల్డింగ్, ముఖం బజారులో అమ్మే రబ్బరు బొమ్మల ముఖంలాగ ఉందన్నాడు. శవపేటిక మూయ్యమన్నాడు.

అటార్నీ జనరల్ కళ్లు తడిసిపోయాయి. బిల్‌వాల్టన్ వయిపు తిరిగి - 'నీ అభిప్రాయం ఏమిటి? చూసి చెప్పాలి' అన్నాడు.

వాల్టన్ ధయిర్యంచేసి చూశాడు ముఖాన్ని మార్చివేశారు. అని తర్వాత అన్నాడు కాని అప్పుడు మాత్రం, 'తెరిచి ఉంచకండి అధ్యక్షుడి పోలిక లేదు. మయినపు బొమ్మలాగ ఉంది' అన్నాడు.

'నిజమే,' అన్నాడు కెన్నెడీ దృఢంగా. 'మూసెయ్యండి.'

ఎందరో అనుకున్నారు—ఏదో దాచవలసి వచ్చి పేటిక మూశారు అని. డేవిడ్‌బర్క్లీకి 'ఎందుకిలా చేశా'రంటూ ఎన్నో ఉత్తరాలూ టెలిగ్రామ్‌లూ వచ్చాయి. అతను ఉన్నసంగతి చెప్పాడు.

'అధ్యకుడి ఆకారం చెడిపోయింది కాబట్టి మూసివేశారు.' అని రాసింది 'టయిమ్' పత్రిక. ఇది నిజంకానే కాదు. అధ్యకుని ముఖానికి దెబ్బతగలనే లేదు. అతని ముఖానికి మేకప్ చేశారు. ఇది కృతిమంగా ఉంది. అది జాన్ కాదు. మదామ్ తుస్సోలోచూసే మయినపు బొమ్మని పోలి ఉంది.' అన్నది తర్వాత ఒకసారి శ్రీమతి కెన్నెడీ

(ఇంకా ఉంది)

సినిమా తార పద్మిని చెప్పుచున్నది.

# 'నా సౌందర్య పోషణకు, నాంది- లక్స్'



మీ సౌందర్యం కూడా ముఖ్యమే...
దానికి వాడదగినది అదే శుద్ధమైన,
సౌమ్యమగు లక్స్ టాయిలెట్ సబ్బు.
పద్మిని చెప్పుచున్నది: "4 రంగులలోను
తెలుపులోను గలది లక్స్ ఒక్కటే.
మరి మనోల్లాసకరమైన పరిమళం కూడాను"




## లక్స్ టాయిలెట్ సబ్బు

సినీమాతారలకు
సౌందర్యమునిచ్చే సబ్బు

లింటాస్-LTS. 220-140 TL

హిందూస్థాన్ లీవర్ ఉత్పత్తి







నావ సరిగ్గా సమయానికి పేలింది. మాకు రాళ్ళ మీద చావు తప్పింది. ఆవాళ్ళే పేలుడు ధాటి నుంచి మమ్మల్ని కాపాడాయి.

సాలిటేయిర్ తెలివి తప్పి ఉంది. తాటి బరువు నన్ను లోపలికి లాగుతోంది.













ఎలాగో పగడాల 'లంక' ఒకదాని దగ్గరికి చేరి సాలిటేయిర్ తలని నీటి మీదే ఉంచగలిగాను.

నావ మునిగిపోయింది. కొంతరు మాత్రమే మిగిలారు.

'ఆ—ఆ—హ్!'
'మైగాడ్! సొరచేపలు!'










అంత మీద నుంచి నావలో నుంచి తప్పించుకు

ఎవరో కాదు. మిస్టర్ బిగ్. పిచ్చిగా ఈదుకుంటూ వస్తున్నాడు.

కాని సొరచేపలే గెలిచాయి. త్వరలోనే లంక మీద మేమిద్దరమే మిగిలాము. నేనూ, సాలిటేయిర్.




మిస్టర్ బిగ్ చచ్చిపోయాడు. సాలిటేయిర్‌కి క్రమంగా తెలివి వస్తోంది.




'సాలిటేయిర్, కంగారుపడకు. నీకేమీ ప్రమాదం లేదు.'




ఇంతలో ఒక కేక వినిపించింది. క్వారెల్, మిత్రులు పడవలలో ఏమి జరిగిందో తెలుసుకోడానికి బయలుదేరి వస్తున్నారు. నాకు అతన్ని చూస్తేనే సంతోషం వేసింది.




మిస్టర్ బిగ్ ముఠాని చితక్కొట్టాను...




త్వరలోనే అందరినీ దొంగబంగారం రవాణా నేరం మీద పట్టుకున్నారు.




'ఇక మన గాయాల సంగతి చూడాలి, సాలిటేర్!'




సాలిటేర్ గాయాల సంగతి చూసిన తర్వాత నన్ను ఆస్పత్రికి పంపారు.




'ఏమయ్యింది అతనికి?'




'ఆ! రెండు బరాకుడా చేపలూ, ఒక పగడాల అంత ..'

'ఇప్పుడు బాగానే ఉందిగా! 'ఎం' నీకు సందేశం పంపాడు. మామూలు భాషలోకి మార్చాము.

(ఇంకా వుంది)




ఒకసారి రాణి ధరించే రత్నహారం కన్పించలేదు. రాణి ఉండే అంతఃపురం లోనికి అక్కడ పనిచేసే పరిచారికలు తప్ప మరెవరూ వెళ్ళరు కాబట్టి వాళ్ళ లోనే ఒకరు రత్నహారాన్ని దొంగిలించి ఉండాలని అందరూ అనుకొన్నారు కాని యెవరు దొంగిలించినదీ తెలిసికొనడానికి ఆధారం యేదీ దొరకలేదు.

దొంగను పట్టుకొనవలసినదిగా రాజు అప్పుడు మల్లన్న మంత్రిని కోరేడు. మల్లన్నమంత్రికూడా యెన్నోవిధాలుగా ప్రయత్నించేడు కాని దొంగతనం యెవరు చేసినదీ తెలియలేదు. అప్పుడు మల్లన్నమంత్రి అంతఃపురంలో పని చేసే పరిచారికలను మరికొందరు భటు లను ఒకచోటికి రప్పించి వారితో యిలాగ అన్నాడు.

'నేను యెంతగా ప్రయత్నించినా, నిజం బయటపడలేదు. అందుచేత నేను మా గురువుగారికి యీ సంగతి తెలియ పరచగా వారు యీ విధంగా కబురు పంపించేరు. 'దొంగతనం యెవరుచేసి నదీ మా మంత్రశక్తివలన తెల్సు కొన్నాము. అయినప్పటికీ దొంగతనం చేసినవారు, తమ తప్పును సరిదిద్దు కొనడానికి ఒక అవకాశాన్ని యిస్తు న్నాము. దొంగతనంచేసినవారు మూడు రోజుల్లోగా రత్నహారాన్ని తిరిగి అంతః పురంలోనికి చేర్చకపోయినట్లయితే మేమే ఆ దొంగపేరును బయటపెట్టి శిక్షించి రత్నహారాన్ని స్వాధీనంచేసి కొంటాము. మా మంత్రశక్తిమీద యెవరికైనా సందేహం ఉంటే దానిని పోగొట్టడానికిగాను మంత్రాక్షతలను పంపేము. ఇవి మా మంత్రశక్తిని రుజువు చేయగలవు.'

మల్లన్నమంత్రి యిలాగ చెప్పి తన చేతినుంచి ఒక ఉంగరాన్ని బయటకు తీసి దానిని వారియెదుట ఉంచి మళ్ళా యిలాగ అన్నాడు.

'ఈ ఉంగరాన్ని నేను యిక్కడనే ఉంచి నేను గదిలోనికి వెడుతున్నాను. మీలో ఒకరు యీ ఉంగరాన్ని తీసి కొనండి. మీలో యెవరు యీ ఉంగ రాన్ని తీసినదీ యీ మంత్రాక్షతలు వెల్లడిస్తాయి.'

ఉంగరాన్ని అక్కడనే ఉంచి మల్లన్న మంత్రి దూరంగా ఉన్న గదిలోనికి వెళ్ళేడు. తరువాత పరిచారికల్లో ఒకామె అందరూ చూస్తుండగానే ఉంగరాన్ని తీసి దాచివేసింది.

తరువాత మల్లన్నమంత్రి అక్కడ ఉన్నవారినందరినీ వరుసగా నిలబెట్టి వారికి గురువుగారు పంపిన మంత్రా క్షతలను కొంచెం కొంచెం యిచ్చి గదిలో ఉన్న దేవిపాదాలవద్ద ఆ అక్షత లను వేయవలసినదిగా చెప్పేడు. ఆ విధంగానే అందరూ మంత్రాక్షతలను మల్లన్నమంత్రి చూస్తుండగానే దేవి పాదాలవద్ద ఉంచేరు. అప్పుడు మల్లన్న మంత్రి ఉంగరాన్ని దొంగిలించిన పరి చారికను గుర్తించగానే ఆమె ఉంగ రాన్ని తిరిగి యిచ్చివేసింది.

'రత్నహారాన్ని దొంగిలించిన వారు మూడురోజుల్లోగా దాన్ని అంతః పురంలో పడవేయకపోయినట్లయితే యిప్పుడు ఉంగరపు దొంగను తెలిసి కొన్న విధంగానే ఆ దొంగను కూడా తెలిసికొని శిక్షించగలము' అని మల్లన్న మంత్రి మళ్ళా అందర్నీ హెచ్చరించి పంపివేశాడు. రత్నహారాన్ని దొంగిలించిన పరిచారిక యీ సంఘటనను చూసి భయపడి రత్నహారాన్ని అంతఃపురంలో పడవేసింది.

రత్నహారం దొరకగానే రాజు చాలా సంతోషించి 'మీ గురువుగారు యెక్కడ ఉన్నార'ని మల్లన్నమంత్రిని అడిగేడు. మల్లన్నమంత్రి నవ్వుతూ రాజుతో యిలాగ అన్నాడు.

'ప్రభూ! నేను మా గురువుగారికి అసలు కబురు పంపనేలేదు. ఆ అక్షత లను నేనే తయారుచేసేను. ఉంగరాన్ని దొంగిలించినప్పుడు అక్కడఉన్నవాళ్ళలో విశ్వాసపాత్రుడైన మన భటుడు వెంక య్యను కూడా ఉంచేను. నేను చెప్పిన ప్రకారమే అతడు దొంగతనంచేసిన పరి చారిక వెనుకనే నిలబడి ఆ పరిచారిక అక్షతలువేయగానే అతనుకూడా అక్ష తలువేసేడు. అవిధంగా నేను ఉంగ రపు దొంగను తెల్సుకొన్నాను. ఇది అంతా మంత్రశక్తేనని భయపడి అసలు దొంగ రత్నహారాన్ని తిరిగి అంతః పురంలో పారవేసింది.

ఈ సమాధానాన్ని వినగానే రాజు మంత్రి తెలివితేటలకు ఆశ్చర్యపడి అతన్ని గౌరవించాడు.



## మల్లన్న మంత్రి






**ఈగ—సాలీడు :**

అనగా అనగా ఒకసాలీడు. అది ఇక్కడి బొమ్మలో చూపినట్లు చక్కని గూడు ఒకటి అల్లుకుని ఒక మూల దాంకుని ఎదురుచూస్తోంది.

కొంతసేపటికి ఒక ఈగ వచ్చి ఆ గూటిలో చిక్కుకుంది సరిగ్గా మధ్యలో. ఈగ తన బంగారు గూటిలో చిక్కుకున్నట్లు గ్రహించిన సాలీడు దాంకున్న చోటి నుంచి బయటికి వచ్చింది. ఈగకేసి కసిగా, సంతోషంగా చూసింది. ఈగ సాలీ



డును చూసి హడలిపోయింది. మామూలు అన్ని సాలీళ్లలాగ ఈ సాలీడు చకచకా తిన్నగా ఈగ దగ్గరకు వెళ్లి, దానిని పొడిచి చంపెయ్యలేదు. పొట్ట నిండుగా ఉండి, ఆకలి కాస్త మందంగా ఉండడం చేత, వెంటనే వెళ్లి ఈగను పట్టి చంపడం అనవసరమనిపించి, ఈగను కాస్త ఏడిపించాలనుకుంది సాలీడు.

సాలీడు తాను (బొమ్మలో ప్రస్తుతం) ఉన్న చోటునుంచి గబగబా ఈగ వేపు నడిచి, దారపు ముడి అడ్డువచ్చిన చోట ఆగింది. తనవైపే వస్తున్న సాలీడును చూచి ప్రాణాలమీద ఆశవదులుకున్న ఈగ అంతలో సాలీడు ఆగడం చూచి, కొత్త ఆశలు చిగురించగా తప్పించుకు పారిపోదామని ప్రయత్నించింది. ఆ గూటి నుంచి పూర్తిగా బయటపడడం సాధ్యం కాలేదు కాని, దారం వెంబడే గిజాయించుకుని నడువగలిగింది. మరోదారపు ముడి అడ్డం వచ్చే వరకూ జరిగింది. అంతలో సాలీడు మళ్ళీ కదిలి తరువాత దారపు ముడిదాకా వచ్చి ఆగింది. సాలీడు ఆగేక ఈగ మళ్లీ నడిచి తరువాత దారాల ముడిని చేరుకుంది.

ఈ విధంగా ఒకసారి సాలీడు, తరువాత ఈగ ఆ దారాల వెంట నడువ సాగేరు. ఒక దారపు ముడినుంచి తరువాతి దారపు ముడిదాకా నడవడం ఒక 'ఎత్తు.' ఈ బొమ్మనే పెద్దదిగా గీసి సాలీడుకి బదులుగా ఒక పెద్ద గవ్వను, ఈగకు బదులుగా, ఒక చింతగింజను ఉంచి ఇద్దరు వ్యక్తులు ఈ ఆట ఆడవచ్చు. ముందర ఎత్తు వెయ్యవలసినది సాలీడు. ఈగ తప్పించుకు పోవాలని ప్రయత్నిస్తుంది సాలీడు దానిని యెలాగైనా పట్టుకోవాలి. పైన చెప్పిన నియమాల ననుసరించి ఎత్తులువేస్తే ఈగ ఎప్పటికైనా సాలీడుకి దొరుకుతుందా? బహు జాగ్రత్తగా గమనించి ఆడితే ఈగ దొరుకుతుంది. కాని, అది అంత సులభమేమీ కాదు.

ప్రయత్నించండి.




**జ వా బు**

ఈ ఆటలో ఒక చిన్న కిటుకు ఉంది. అది తెలుసుకోకుండా ఎంతసేపు ఆడినా ఈగ పట్టుబడదు. చతుర్భుజంలో ఐమూల బిందువులదగ్గర ఈగ, సాలీడు నిలుచుని ఉన్నాయనుకుందాం. అప్పుడు ముందుఎత్తు వెయ్యవలసినది సాలీడు అయితే ఈగ దొరకకుండా ఆ చతుర్భుజం చుట్టూ ఎంతసేపైనా తిరుగగలదు. అదే ముందు ఎత్తు వెయ్యవలసినది ఈగ అయితే సాలీడు దానిని తరువాతి ఎత్తులోనే పట్టివేయగలదు. ముందర ఈ ధర్మసూక్ష్మం అర్థం అవాలి.

ఆట మొదట్లో సాలీడుకి 8 బిందువుల అవతల ఈగ నిలుచునిఉంది. 8 సరిసంఖ్య. ఇప్పుడు ఎత్తువేయవలసినది సాలీడు. బొమ్మ అంతా చతుర్ముఖములతోనే నిండి ఉంటే సాలీడు ఎప్పటికీ ఈగను పట్టుకోలేకపోను. ఇది పైన చెప్పిన చతుర్భుజం చుట్టూ తిరగడం వంటిది. కానీ, సాలీడుకి ఒక్క ఆశాకిరణం ఉంది. బొమ్మలో ఒకే ఒక త్రిభుజం కూడా ఉంది. ఈ త్రిభుజాన్ని ఉపయోగించుకుని ఈగ సాలీడుకి సరిసంఖ్య బిందువుల దూరంలో ఉన్నప్పుడు ఎత్తువెయ్యవలసినది ఈగ అయేటట్లు చేయవచ్చు. అప్పుడు సాలీడు విధిగా నెగ్గుతుంది. దీనినే మరోలా చెప్పాలంటే ఎత్తు వెయ్యవలసినది సాలీడు అయినప్పుడు ఈగ బేసి సంఖ్య బిందువుల దూరంలో ఉన్నట్లయితే సాలీడు నెగ్గుతుంది. ఎత్తువెయ్యవలసినది ఈగ అయితే, ఈగ సరి సంఖ్య బిందువుల దూరంలో ఉన్నప్పుడు కూడా సాలీడు నెగ్గుతుంది.

బొమ్మలో ఉన్న త్రిభుజాన్ని ఉపయోగించుకుని తనకు అనుకూలంగా ఉన్న ఆటను సాలీడు సరిదిద్దుకోవాలి, ఆ పని కోసమై ముందర హుటాహుటిగా సాలీడు త్రిభుజాన్ని చేరుకోవాలి. ఆ త్రిభుజాన్ని చుట్టివస్తే పరిస్థితి తారుమారు అవుతుంది. అప్పుడు సరి సంఖ్య బిందువుల దూరంలో

(61 వ పేజీ చూడండి)




■ కూసునోల్లు కూసున్నట్లు, నిం వడ్డోల్లు నిలవడ్డట్లు, కొట్కుకు పోయేంతగాలి వెడుతుంది. మొగులు గనవడ కుంటవున్న తెప్పలన్ని గాలికి యెక్కడి యక్కడ గొట్కపోతున్నాయి. అక్కడున్న శింతచెట్లు, యాప శెట్లు, మామిడి శెట్లు—యింకా...యింకా...అన్ని చెట్లు తొశి తల్కాయ లూపుతున్నాయి.

అది మాదిగోల్లవాడ. అన్నిగుడిసెలే — గుడిసెలకట్టు మోటతాయిట్లు,బొంతలూ పోలాలున్నాయి. ఓ పెద్ద గుడిసె ముంగట ముగ్గురు మొగోల్లు, యిద్దరాడోళ్లు, గూసో నున్నారు. వాళ్ల నడుమ పెద్ద కల్లుకుండు న్నది. అండ్లసగము ఇదువరకే కతం సేసిండ్రు.

'గాలి బాగా పెడుతున్నదుల్లా, యింట్లకు పోదాం పొండ్రి, లేకపోతే గొట్కపోతాము.' మునలోడు నారిగాడు శెట్లమొకాన జూసు కొంటన్నాడు.

అయ్య మాటిన్న పేరిగాడు చిన్నడువిచ్చిండు. 'గాలిదానికే బయపడితే యెట్లనయ్యా యింత సేపని పెడ్తది ? యింకో అద్దగంటవో గంటవో. యీకొంత కుండ కతంజేయంది యింట్లకోవద్దు.' అను కుంట కుండలది గి వలకు బోశిండు పేరిగాడు.

'అరేయిపేరిగో!' అయ్య పిలిశిండు.

'ఏంది?' తల్కాయెలావట్టి జూశింత పేరిగాడు.

'యిప్పుడెన్నిగొట్టిండ్రో యేర్కేనా?'

'యెన్ని గొట్టిండ్రు?' కండ్లబొమ్మల వంచి అయ్యనే జూశిండు.

'రొండు జాములు.'

'ఆఁ.' నోరు దెరిసింది ముసలి యెంకి.

'యిప్పుడు రొండుజాముల నాత్రైందా?' ముక్కుమీదికి గొంటబోయింది యేలును పేరిగానిపెండ్లాము లచ్చి.

'లేకపో లేందను కున్నావే. కడుపులు వలుగ దాక్కుంట గూసునోల్లంకు పొద్దెట్ల తెల్వాదే?'

'ఐతే పోదాం పొండ్రియింట్లకు!' ముసల్ది లెవ్వబోయింది.

'మరికల్లో!' లచ్చి అడిగింది.

'రేపు దాగుదాం తియ్యి!' దానిమామ నారిగాడన్నాడు.

'వద్దు. యిప్పుడే దాగుదాము! రేపటి దాన్కవుంటె కరాబైతది. యీసల్ల వూట గూసేవి తాగకనట, రేపు దాగుదాం, మాపు దాగుదాం అంటవేంది!' అవ్వను లెవ్వకుంట రెక్కవట్టి ఆపి అయ్యతోని అన్నడు, శిన్న కొడుకు నరిశిగాడు.

'నీయిట్టం! యిప్పుడే దాగుదాం తియ్యి మరి' అనుకుంట ముసలినారిగాడు బొర్లశి వగిలాసల్ని యెల్లల వెట్టిండు.

'లచ్చి!' పేరిగాని పిలుపు.

'ఁ.'

'లచ్చి!'

'ఓ, అంటుంటే శెవులినత్తలెవ్వా?' కొంచెము కోపానికచ్చింది లచ్చి.

'నేనిప్పుడు రొండుసార్లు పిలిశిన్నా!' అచ్చెరుపడి లచ్చి కండ్లండ్ల కండ్లు వెట్టి అడిగిండు పేరిగాడు.

అవ్వ నవ్వుకుంటున్నది, 'బాగ దాగుతే ఒక్కపారి పిలిసింది-రొండుసార్లు పిలిసింది పోయుంటదా?'

'అయితె వానాయెగని లచ్చి! నువ్వుదాగింది జాలు. పొయ్యి పోలగాండ్లకు బువ్వలువెట్టు.

రిక్కడోల్లక్కడ నిద్రపోయిండ్రచ్చు పో! యిదివారుకే గింతరాత్రయింది. అన్నాడు లచ్చితోని పేరిగాడు.

లచ్చికి కళ్లు విడిసివెట్టి బొబుద్దిగాలె, శెవ్వకుంటా అట్లానే గూసున్నది.

'పోవే, అంటె యింక గూసున్నావేంది' ముసల్ది దయ్యమోలె గుడ్లు మిట్లరిచ్చింది

'పాపపుముండ' అనుకున్నది ముసల్దాన్ని మనసుల లచ్చి అలుగుమూతితోని మెల్ల లేశింది. గుడిశెలకొంగనే ఐదుగురు పో గాండ్లు అక్కడోడు యిక్కడోడు వంటి వున్నరు బూమ్మీద అందర్నిలేపి కూకుండ బెట్టేవారకే అద్దగంటయింది అయిదు కంచాలుదెచ్చి అందరికి బువ్వవెట్టింది.

'నరిశిగాని పెండ్లి యింకెప్పుడు జేత్తా మురా?' గుడిసెముందట పెద్దోన్ని అడుగుతుంది ముసల్ది.

పేరిగాడు మాట్లాడలేదు.

'పిల్లదే మరి!' నరిశిగాడు నవ్వుకుంట న్నడు

'లచ్చిశెల్లె రంగి!'

ముసలినారిగాడు నవ్వుకుంటన్నడు'వాల్లు మనకిత్తరా!'

'యెందుకియ్యరు? యిదివారుకు లచ్చి నిచ్చి వోల్లు, యిప్పుడు రంగినియ్యరా?' అన్నది ముసల్ది.

'ఒక్కతల్లి పొలగాండ్లను ఒక్కనెత్తురు వంచుకోని పుట్టినోళ్ల కియ్యకూడదట గదనే' అన్నాడు నారిగాడు.

'అదంత బామ్మండ్లకు, కోమట్లకు-యియ్యాల్లా-రేపు అన్నపొల్లగాండ్లనే జేసుకోంగలేదటకని, అది నేతోడబుట్టిందాన్ని జెస్కోవద్దట యెవడు జెప్పిండు నీకు? శెప్పినోనింట్ల మన్నువడ' అట్లు మొదలుపెట్టింది ముసల్ది.

'ఐతే రంగిని జేస్కుందామంటావా?'

'బంగారమోలె!'

యిదంతా గుడిశెలనుంచి యింటున్న లచ్చి కండ్లనుంచి నీళ్లు వడిపింది శేతులు జోడిచ్చి 'అయ్యో! భగవంతుడా, నాశెల్లెను గూడా యింకొంపల వడేయ్యకు. యీకట్టాలు దానికి గూడవెట్టకు. నీకు దండము బెడుతున్న' అనుకుంటా ఏడ్చింది లచ్చి.

'అవ్వా! గీడరూపాయి నోటు పెట్టిన తీసినావే?' గుడిసె ముంగట అవ్వ నడుగుతున్నాడు పేరిగాడు.

'యెడ పెట్టినవ్?'

'గీ శింతచెట్టుకింద'

'అయ్యో! ఎవలు దీశిండ్రో కని, నేను దియ్యలేదురా!'

'నరిశిగా! నువ్వు దీశినావా!'

'ఓట్! నే నెందుకు దీత్త.'

'మరెవ్వల్దిత్తరు? అయ్యా నువ్వు దీశినావా!' అయ్య నడిగిండు పేరిగాడు.

'నేను గూడా దియ్యలేదురా!' నారిగాన్నాడు.

'లచ్చి!' కేక పెట్టిండు పేరిగాడు

గుడిశెలకెల్లి యింటున్న లచ్చి పేరిగాడు పిలువంగనే దబ్బదబ్బ యివుతలకచ్చి పేరిగాని ముందటి కచ్చింది.

'గీడి రూపాయినోటు దీశినావే?' రాంగనే అడిగిండు

'నేను దియ్యలే!'

'మరి యెవ్వల్దిత్తరు?'

'ఏమో! నాకే మెర్క?' జాలి మొకం బెట్టింది లచ్చి.

'సిరి పోగులేత! అవద్దాలాడకు రూపాయిటియ్యి!' పేరిగాని కండ్లెర్ర వడ్డయి.

'నే నెందుకు దీశిన! నా మీద పెడ్తవు?' యేడుపుముఖము పెట్టింది లచ్చి.

'అరేయ్ కొడ్కా! యీ ముండనే తీసింది రా! యెందుకంటే యిదువా దాన్క యిది శింతశెట్టుకిందనే గూసున్నది.' అన్నది ముసల్ది.

'సప్పుడు జెయ్యక తీసుకున్న రూపాయి వారెయ్యి! తన్నులు వడేదాన్క వూకోకు' కోపంతోని వురిమిసూశిండు.

'మా అవ్వతోడు నేందియ్యలే! మా శెల్లె తోడు నేందియ్యలే మా అయ్యతోడు నేం దియ్యలే!' లచ్చి కండ్లల్లనుంచి నీల్లదార మొదలైంది.

'పోయిలె కట్టెదేవే అవ్వా! రొండు తన్నుద్దింటె అదే శెప్తది.'

లచ్చి బోరుమని ఏడిశి అన్నది. నా ఐదుగురు పొలగాండ్లతోడు నేం దీస్కోలేదు.'

'లచ్చీ! ఆకరిసారి చెప్తున్నా. రూపాయి యిస్తవా తన్నుల్దింటావా?'

పేరిగాడు కోపంతోని వూగుతుండు.

'తన్నులేతింట! నేనిందియ్యందే యేడ్కెల్లి తెచ్చియ్యాలే!' లచ్చి యెక్కి-యెక్కి యేడ్చుకుంటున్నది.

ముసల్ది తెచ్చిన కట్టెతోని యెన్నుమీద బలంతోని గొట్టిండు.

'ఓలమ్మో!' కేక పెట్టింది లచ్చి.

'సంపిపారేస్త ముండా, రూపాయి యెక్కడ దాశినవో శెప్పు?'

మల్లొకటి గొట్టిండు.

'అయ్యో! నీకు దండము బెడుతా. నేను దీస్కోలే. నన్ను గొట్టకు. నీ తోడు నాతోడు నా పొలగాండ్లతోడు నేం దీస్కోలేదు.'

'నా మీద ఒట్టేట్కుంటావే నా పొలగాండ్లమీద ఒట్టేట్కుంటావే, యిప్పుడు నిన్ను సంపిపారేస్తా?' దబ్బదబ్బ కట్టెర్గిపొయ్యేదాక్క గొట్టిండు.

ఒడ్డుకు వడ్డ శాపపిల్లోలే లచ్చి గిలగిల గొట్కుంటున్నది. గొడ్డరిసినట్లు ఒర్రుతున్నది.

'యింక గొట్టు! సచ్చేదాన్క గొట్టు. అవద్దాలు గూడ నేర్చుకున్నది. బర్దెగిన ముండ.' అనుకుంట శేతుల్దిప్పతుంది ముసల్ది.

'యిత్తవా! యింక గొట్టమంటావా!' బోర్ల వక్కల వన్న లచ్చిని అడిగిండు పేరిగాడు.

సప్పుడ్జేదు. సలిలేదు.

'మాట్లాడవేమే?' ఒర్రిండు

'.................'.

లచ్చి యెన్నుల్నుంచి నెత్తుర్గారుతుంది.

లచ్చి బుజమీమ్మదినుంచి నెత్తుర్గారతుంది.

లచ్చి నొసల్నుంచి..................

లచ్చి మొకాల్నుంచి..................

లచ్చి శెవ్వమీదినుంచి..................

పిలిశినా మాట్లాడక పొయ్యేవారుకు పేరిగానికి మనుసుల ధడిల్లుమన్నది లచ్చి ముంగటికుర్కి వంగి యొల్క లేశిండు.

కండ్లు మూస్కోనివున్నది.

'అవ్వా!' కేక వెట్టిండు.

'యేందిరా!' అనుకుంటా దబ్బదబ్బ పేరిగాని ముందరికుర్కచ్చింది ముసల్ది.

'లచ్చి కండ్లు మూస్కపోనీయే!'

'ఆ' అన్కుంట ఆంగిసూసింది ముసల్ది.

మొకంల మొకం బెట్టింది

'సావలేదురా! తెలివిదప్పింది' అన్నది.

పేరిగానికి దడదడ మన్నది. 'మరెట్ల యిప్పుడేం జాత్తాము?' అన్నాడు.

'ఏం లేదు. యెత్కపోయి మంచముల

తెలవెల్తుంంద్రడ్ అన్నాడు మునలి నారిగాడు.
'తెల్లారేవరుకూ చచ్చిపోతాదో యేమో?'
'యేం, జావదు'.
నరిశిగాడు, పేరిగాడు యిద్దరు గలిసి లచ్చిని గుడిశెల కెత్తుకపోయింంద్రు గాలి దొబ్బుడు బందైంది, కొంచముసేపటికి.
'బువ్వవెడుతున్నరాంంద్రుల్లా!' మొగన్ని, కొడుకుల్ని గుడిశెలకొయ్యి పిలిశింది యెంకి
'అవ్వా! లచ్చిగూడా దిన్లేదే బువ్వ' పేరిగా డన్నాడు.
'పావు బతుక్కల్లున్న దాన్కెందురా బువ్వ? పాడుముండ, సచ్చినా మంచిగుండు!' అన్నది మునల్ది, కుండలున్న బువ్వను కంచంలకు దోడుకుంటా.

* * *

'తెల్లారిందుల్లో, లెవ్వంంద్రుల్లో' అనుకుంట కోడిపుంజులు లేల్లి వెడుతున్నయి. 'మా గుడిశెల్నూ, మిమ్మల్నూ మాడ్సి పారెత్త' అనుకుంట సూర్రుడు మొగుల్నిది కత్తున్నడు. యింటిముంగటి శింతశెట్టు మీద కాకుల. కోవులు వరిగిపొయ్యేటట్టు ఒర్రుతున్నయి.
లచ్చి మంచంల లేశికూసున్నది. నుట్టు జూసింది. ఓ మంచముల పేరిగాడున్నడు. యింకోదాండ్ల నారిగాడు, యింకోదాండ్ల నరిశిగాడు వన్నరు. బూమిమ్మీద బొంతేసుకొని యెంకి, ఐదుగురు పొలగాండ్లు వన్నరు.
లచ్చి యొమ్ము ముట్టుకొని సూశింది. రైక నెత్తురు కంటుకపోయింది. గుంజాతె రాలేదు. బలంతోని గుంజాతే మల్ల

# పొద్దూకె దయ్యాలు...

నెత్తురు గారత్తది.
లచ్చి మెల్లగ మంచముల్కెల్లి లేశి నిలవడ్డది. నోకాల్లు జాడిచ్చింది. అయినా నడువరాలే.
తల్కాయల సూదులు గుచ్చినట్టు నొత్తుంది.
కాల్లుఒల్లు — జిల్లువంటున్నయ్.
పెయ్యిలున్న నరాలన్నీ సలుపుతున్నయి.
'అయ్యో భగవంతుడా! నన్నెందు కింత గోసబోసుకుంటున్నవ్?' అనుకుంట అట్లే నిలవడి గోడిశెపు యేడ్చింది. 'యెంతయేడిత్తె ఏం లాభము? ఆడుగొట్ట కూకుంటాడా? రాంంద్రోజుల కోపారన్న గొడ్తడు. యీ తన్నులిన్నుకుంట కుక్కబతుకు బతుకుడెందుకు? సత్తె మంచిగుండు?'
'కని......కని ఐదుగురి పొలగాండ్ల గతేమైతది? తను జత్తే ఆడు యింకోదాన్ని జేసుకుంటాడు. అది తన పొలగాండ్లను కట్టపెడ్తది. వద్దు! తను జచ్చిపోవద్దు. యెంత గొట్టినావడాలే! పొలగాండ్లకోసం తను బతకాలే' అనుకున్నది.
మెల్లమెల్లగ కుంటుకుంట వాకిట్ల కోయింది లచ్చి. శీపురుతోని వాకిల్నంత వూడిశి అలుకు జల్లింది! బాయికాడికోయి పండ్లు దోముకొని మొకం గడుక్కున్నది. మొకం గడుక్కుంటుండగ నారిగాడు లేశి బాయికాడి కచ్చిండు. లచ్చితోని నారిగాడు మాట్లాడలేదు.
మొకం కడుక్కొని గుడిశెలకోయి అందర్ని లేపింది. బట్టలు మంచాలు దీశి యిల్లూడిసింది.
'యెంకవ్వా. లచ్చి! రాంంద్రుల్లా' గుడిశె ముంగట్లనుంచి నాయ్యేటోల్లు శేకలు వెడుతుంంద్రు.
లచ్చి కొడువలి శేతపట్టుకొని యింటి ముంగటికచ్చింది. 'మీరయితె నడువుంండ్రి, నేను మొకం గడుక్కొనత్త' అన్నది మునల్ది.
కోతకొయ్యేటోల్ల గుంపు కదిలిపోయింది.
మునలి యెంకి బాయికాడికొయ్యి మొకం గడుక్కున్నది. యింట్లకచ్చి బువ్వదిన్నది. తిని కొడవలి శేత వట్టుకున్నది.
'అయ్యో!...... అయ్యో! ......' లచ్చి పెద్దకొడుకు గుడిశెలకురి కచ్చిండు దబ్బదబ్బ.
'ఏందిరా?' పేరిగా డన్నాడు.
'ఇగో! మన గుడ్సెనక్క ముండ్లకంపకు యీ రూపాయినోటు దట్కొనున్నది'. వాని శేతుల రూపాయి నోటున్నది.
'ఆ' పేరిగాడు నోరు దెరిశిండు. వాని కండ్లండ్లనుంచి నీల్లు టపటప రాలినయి. యెంకి ముక్కుమీదేలేసుకున్నది. నరిశిగాడు గుడ్లు మిట్కరిచ్చిండు.
'పాపం! ఉత్తగ అదినెను గన్ని దెబ్బలు గొడితివి! అన్నడు నరిశిగాడు పేరిగాన్ని జూసుకుంట.

* * *

ఎండిపోయి అంగిపోయిన ఆరిశేనుమ అంగి దబ్బదబ్బ గోతుంంద్రు ఆడోల్లు.
కొంచెము దూరంగ గోతున్న లచ్చి తల్లి, లచ్చిని జూడంగనె దెగ్గరికచ్చింది.
'మీ అత్తేదే లచ్చి?' రాంగనే అడిగింది.
'యింక రాలే! వత్తపా అన్నది.'
'అవ్వా?'
'ఏందే!'
'రంగి లగ్గ మెప్పుడు జేత్తరా?'
ఆ మాటినంగనే లచ్చి తల్లి తల్కాయిలా వట్టిసూశింది. 'ఎందుకూ?' అన్నది.
'మా మర్దికిత్త నన్కుంటున్నరా?'
'ఓయ్! మే మెందు కిత్తమన్కుంటున్నాము'.
లచ్చి మనుసు వల్లవడ్డది. 'గదే శెప్పా అన్కుంటున్న! నీ కాల్మొక్త. మా మర్దికైతె యియ్యకుండి?'
'ఎందుకు?'



'మా అత్త మంచిదిగాదు, మా మామ మంచోడుగాడు, మా మర్ది మంచోడుగాడు బాగా కట్టుబెడ్తరు''

'నిన్నేమన్న కట్టుపెడ్తుండ్రా?'

'ఓయ్! ననేమంటలేరు! బంగారమోలె చూస్కోంటుండ్రు?' అని లచ్చి బొంకింది

'మరి రంగిని గూడ బంగారమోలె జూస్కారా?'

లచ్చి బయవడ్డది 'అతె యిత్తరా రంగిని?'

# పొద్దూత్తె దయ్యాలు...

'యెట్లిత్తవే ఒక్కతల్లి పొల్లగాండ్లు గదా?'

'యేది నా పీదాక్కెట్కో యియ్యవని?' లచ్చి దబ్బదబ్బ అడ్గింది

'నా పానంబోయిన యియ్య! నీ తోడియ్య' అన్నది మువల్ది

'హవ్వ!' అనుకున్నది లచ్చి

రెండు జాములొచ్చిట్టుండ్రు అందరు బువ్వల్దికేంది కెండ్లల్లకొత్తున్న లచ్చి వోలేదు

'యేమాయెనే లచ్చీ! నువ్వు రావా?' అడ్గింది అవ్వ

'పొద్దుగాల్లనే తినచ్చిన'

లచ్చి తల్లి ముక్కుమీదేలేసుకున్నది. 'మల్ల దినవా?' అన్నది

'ఇదిగో, మా అత్త సద్దిదేసుబోయింది. తెచ్చినంక దింట' అని బొంకింది నిజమే నన్కొని లచ్చి తల్లి దినపోయింది

కడుపుల వురుముతుంది కొయ్య శాత వొత్తలేదు కండ్లు మూస్కపోతున్నయ్ అయినా యింటికి బువ్వదినవోలేదు ఒక్కతే కొత్తున్నది

యిండ్లల్లకోయివోళ్ళు అందురు ఒక్కొక్కలు అచ్చిను లచ్చి అత్త యెంకి రాలేదు పొద్దాల్ల అచ్చిందిగని వగబెట్కోందుకు రాలేదో?

అందరు కొడువండ్లు వట్టి దబ్బదబ్బ గొత్తున్రు, పాటవ్వాడుకుంట

దీపాలు గూట్ల వెట్టేయాల్లయింది కైకిలి పైసలడుక్కొని బొడ్ల జెక్కుకొని నడుత్తుంది లచ్చి

'రంగి—రంగి, రంగి—ఎప్పుడు గూడ రంగివాడికే పోతుంది జీవునము

రంగిని తన మర్ది నరిశిగాని కిత్తె బాగుండది తన మొగడూ, మర్ది—అత్తా మామ పొద్దూకులేదయ్యాలు తెల్లార్తె మనుసులు నాత్రంత దాగి తందనాలాడ్తరు. పెండ్లాలను కొడ్తరు శీ, యిటున్న సూర్యుడు అటు బొడిశినా నా బంగారము సొంటి శెల్లె రంగిని యీ పాపాత్ముల నడుమ వడనియ్య' అనుకొని మనుసును గట్టిగా జేస్కొన్నది లచ్చి

గుడిశెల అడుగు వెట్టంగనే యెదురుంగ దబ్బదబ్బ వురికచ్చి విగ్గితగా లిచ్చుకున్నాడు పేరిగాడు

'నా లచ్చీ, నిన్న నిన్ను గంతిగొట్టిన నా శేతులు కాల్లె కొను ఆ రూపాయి దొర్కినప్పటినుంచి నా జీవునమంత నీమీదికే గొట్కోంటున్నది నీకు దండము బెడుతనే. పొద్దట్నుంచి వుపాసమున్నవు దా! బువ్వ దిందువు?' అన్నాడు రెక్కవట్కొని



నవ్వు–పువ్వు (ఫోటో : బ్రహ్మదేవ్)

'రూపాయి దొరికిందా?' లచ్చి నోరు దెరిశింది

'పొద్దుగాల్నే దొర్కింది మన గుడిశెన్క ముండ్లకంపకు దట్కొన్నది నిన్ను వుత్తగ గవ్వి దెబ్బలు గొడ్తిని నా జీవునము పాడు గాను' అని లచ్చి గద్వవట్కొని 'లచ్చి! నాత్రిగూడ నవ్వు బువ్వ దిన్లే నా గడ్వుల నల్లజేసినట్లయితుంది, దా' అన్నాడు బతిలాడుకుంట

లచ్చి న్యాలకు మొకమేశి 'నా కాకల్తైత లేదు' అన్నది

ఆ మాటిని పేరిగాడు యేడుపు మొకం బెట్టిండు 'నామీద నీకు గంతకోపముంటె నన్ను గొట్టు' అన్నడు

లచ్చి మనను నీళ్లు నీళ్లయింది తల్కాయెలా వట్టి పేరిగాని కండ్లల్లకు జూశింది పేరిగాని కండ్లు లచ్చికండ్లను బతిలాడుతునయ్

యిదువారకటి దంతా మరిసిపోయి పేరిగాని యెన్కయింట్ల కొయ్యకంచంలకు బువ్వదోడుకున్నది లచ్చి

పేరిగాడు లచ్చిదగ్గెర గూసున్నడు ఐదుగురు పోలగాండ్లు ఒగనెన్క ఒగడువచ్చి లచ్చిని దయ్యాన్ని జూశినట్టు జూత్తున్నరు

'దగ్గెరికి రాండ్రి' పిలిశింది లచ్చి

అందరువోయి తల్లిసుట్టు గూసున్నరు

ఐదుగురి పోలగాండ్లకు పెట్టి తను తిన్నది

* * *

బగ్గనాత్రైంది

నిన్నటి దానికన్న కొండంత లున్నది కల్లుకుండ దానిసుట్టు ముసలినారిగాడు, పేరిగాడు, నరిశిగాడు, యెంకి గూసున్నరు ఒగలకన్న ఒగలు యెక్వదాగుతున్నారు

'లచ్చి'! పిలిశిండు పేరిగాడు

'ఏంది?' దూరంగ మంచమ్మీదినుంచి మాట్లాడింది లచ్చి

'దా!'

'ఎందుకు?'

'తాగేతందుకు'

'వద్దాగ'

ఆమాటివి పేరిగాడు తల్కాయె లొవట్కే లచ్చిని జూశిండు 'ఎందుకు దాగవ్' అన్నాడు

'ఆకల్లులమన్ను పొయ్య తాగు తేమత్తది యియ్యాల్లట్నుంచి నేను బంద్ జేత్త'

పక్కడవక్కడ నవ్విండు పేరిగాడు.











# పొద్దూత్తె దయ్యాలు...

'కళ్ళు మూసుకున్నావేటి యీ వేళంటోనే లేదే లచ్చీ!' అన్నాడు నవ్వుతుంటోనే—

లచ్చి మాట్లాడనే లేదు.

'అది బాగుంది అయ్యలా, నరిశిగాని అగ్గము మాట్లాడుతామంటె మప్పు లచ్చి తోని మాట్లాడవడితివి' అన్నడు మునసి సారిగాడు.

'ఏంది చెప్పు!' అన్నాడు పేరిగాడు— నారిగాని దిక్కు తిరిగి.

'యీ నడుమ మంచి దినాలున్నాయట'

'ఏముంటోంది?'

'మన నరిశిగాని అగ్గము శేత్తాము'

'నేనద్దన్నానా? రంగిని నట్టి శెయ్యండి? రంగి గునం మన కెర్క లేదా, నరిశిగాని గునం వాల్లకెర్క లేదా? బంగారమోలుంటది. వచ్చే అమావాస దాటితె మంచిదినాలుంటయి. యీ నడుమనే శెయ్యాలె.'

వాల్ల మాటలిని లచ్చి కోపముతోని మంచముల కెల్లి లేచినిలవడ్డది.

'ఇది వాల్లెత్తరో, యియ్యరో!' మునసోడన్నడు.

'యెందుకియ్యరు?' అని కోపంతోని 'యియ్యకపోతె దొంగతనంగ యెత్కచ్చి శేత్తాము' అన్నడు పేరిగాడు.

లచ్చి మండిపోయి అన్నది. 'నా తాత సొమ్మా, యెత్కచ్చేందుకు.'

పేరిగాడు లచ్చినిజూశి పండ్లుగొరికి 'మేమేమన్న జేసుక్కుంటాము. నడుమనీకేంది?' అన్నాడు కోపంతోని.

'నా శెల్లెమీద నాకువట్టి లేదా?' అన్నది లచ్చి గుడ్లు మిటకరిచ్చి.

'ఐతేనయమే! నీ శెల్లెను తోలుకచ్చి లగ్గముజేయి నరిసిగానితోని' పేరిగాడన్నాడు.

'నాపానముండగ నా శెల్లెను యీయింట్ల వడనియ్య' అన్నది లచ్చి కోపముతోని.

పేరిగాని కండ్లెర్రవడ్డయి. కిందిపెదమును పండ్లతోని తొక్కుకుని కొరుక్కున్నడు.

'పాడుముండా! నీ పానముండగ నీ శెల్లెను నరిశిగానికి జెయ్యనియ్యవా? ఐతే యిప్పుడే నీపానాన్ని జంపిపారేత్త జూడు' అనుకుంట జుట్టుపట్టుకొని కాలునెత్తి లచ్చిమీద తన్నిండు.

'ఓ అమ్మో!'

కుప్పరాయి మోస్సువీరాడ వడంగనే పొవుకకవెట్టి జామ్మీద వడ్డది లచ్చి.

'అయ్యో! అయ్యో! గంతదెబ్బ గొట్టిమేందిరా?' యెంకి భయంతోని ఒర్రింది.

'కొట్టుడుగాదు, సంపిపారేయ్యాలె ముండను' అనుకుంటదమ్ము తీత్తున్నడు పేరిగాడు.

లచ్చి లెవ్వలేదు. వడ్డది వడ్డట్టే వున్నది.

'లచ్చి!' పిలిచిండు నారిగాడు.

'— — — — — —.'

తెలిసొస్తున్నది అందరికి. ఒగల మొక మొగలు జూసుక్కున్నారు. 'మల్ల దివ్వటోల్ల తెలివిదప్పిందోయేమో!' అన్నది యెంకి.

'గంత దెబ్బదాకినంక తెలివిదప్పదా! పోదా?' అన్నాడు నరిశిగాడు దాగుకుంటునే.

అమాట వింగనే అందరికి భయమైంది.

దబ్బదబ్బ యెంకివొయ్యి లచ్చిని ముక్కుకాడ యేలువెట్టింది. లచ్చి జప్పిపోతె, మొసదీత్తున్నది.

'పోలేదురా, పేరిగ! తెలివి దప్పింది' అన్నది యెంకి.

అందరి మనుసులు నల్లవడ్డయి.

పేరిగాడు, నరిశిగాడు, లేశి లచ్చిని లేవట్టుకపోయి మంచముల పండవెట్టిండ్రు.

* * *

తెల్లారింది.

మంచముల లచ్చిలేదు. అందరు నోర్లు దెరిశిండ్రు.

పేరిగాడు లచ్చి అవ్వోరింటి కురికిండు, అక్కడున్నదేమోనని.

'నాలచ్చి నేమిజేసిండ్రు దుల్లో' అనుకుంటా ఏడుపు మొదలువెట్టింది పేరిగాడడ్గంగనే ముసల్ది.

వూరంతా జల్లెడవట్టి గాల్చిండ్రు దొర్కలే.

రెండుజాముల పొద్దుకు గుడిశెన్క మోటబాయిల, బోర్లబొక్కల దేలింది లచ్చి. ●

## అభియోగాలలో వింతలు

# బాలుడి దిగంబర నాట్యం

"మా అబ్బాయి వయస్సు 15 సంవత్సరాలు 'ఎల్ ఎస్ డి' మాత్రలు మింగాడు గాజుపలకలున్న కిటికీలోనుంచి దూసుకుపోయాడు అతరువాత గాజు పలకల తలుపులలోనుంచి బయటికి దూకడు వళ్ళంతా గాయాలు రోడ్డు వెంట పరుగెట్టాడు చివరికి ఒక చర్చిలో దిగంబరంగా నృత్యం చేస్తూండగా పట్టుకున్నాము ప్రాణం పోయేటంత పెద్ద దెబ్బలు తగిలినవని వాడికి తెలియదు ఏదో ప్రమాదం జరిగిందన్నాడు" అని ఒక తల్లి ఆగస్టు 24 న చెప్పింది

వారు సంపన్నులు — గౌరవనీయమైన కుటుంబమే వారి నివాసం అక్టన్‌లో ఉన్నది — విశాలంగా, దర్జాగా ఉంటుంది ఈ బాలుడి వయస్సు ఆగస్టు 19 కి 15 సంవత్సరాలు పుట్టినరోజు పండుగనాడు పాపం—అస్పత్రిలో ఉండవలసివచ్చింది భుజాలలోని నరాలూ, కండరాలూ తుక్కుతుక్కయినవి చేతులు మళ్ళీ స్వాధీనంలోకి వస్తావో రావో తెలియదు

తన కుమారుని విషాద గాధను వివరించిన ఈ తల్లి తన పేరును ప్రకటించవద్దని కోరినది షోకులకోసమో, నాజూకుల నెపాననో రకరకాల మందులు మింగే వారికి హెచ్చరికగా తన కుమారుని కథ ఇట్లా చెప్పింది 'ఎల్ ఎస్ డి' వంటివాటికి మా అబ్బాయి అలవాటుపడ్డాడేమో తెలుసుకుందామని హోటళ్ళకూ, ఫలహారశాలలకూ వెళ్ళి వాకబుచేశాను 'వీరా అబ్బాయి ఎల్ ఎస్ డి మింగుతున్నాడు. ఆ అలవాటును మాన్పించడం వీరాకు సాధ్యం కాదు' అని చెప్పారు

'ఈ వింగ్‌లోని ఒక పబ్లిక్ స్కూల్‌లో ంశా రకం మందులు సప యిచేస్తున్నాను ఎవరు సప్లయి చెస్తున్నదీ మాత్రం బయట పెట్టలేదు తల్లినైన నాకైనా చెప్పలేదు మా అబ్బాయికి మిత్రులున్నారు వారిని ఇంతవరకూ నేను చూడలేదు. ఎవరేమి చెప్పినా సులభంగా నమ్మే బలహీనుడు మా అబ్బాయి ఒక్కొక్క రోజు వేకవజాము వరకూ యింటికి రాడు

'ఆగస్టు 19 వ తేదీ రాత్రి పదకొండు న్నరకు నలుగురు యువకులు మా అబ్బాయిని మా యింటికి తీసుకువచ్చారు బాగా తాగుతున్నాడని చెప్పారు అంతలోనే వాడు పరుగు లంకించుకున్నాడు నేనూ, నా భర్త మోటారుకారులో వాడి వెంట పడ్డాము వెస్ట్ అక్టన్, సెయింట్ మార్టిన్ చర్చిలో కనిపించాడు వంటిమీద దుస్తులేమీ లేవు వళ్ళంతా రక్తం!

అంబులెన్సు వచ్చేముందే ప్రాణంపోతుందేమోనని భయపడి, అక్టన్ పోలీస్ స్టేషన్‌కు తీసుకువెళ్ళాము దోవలో నా మణికట్టును కొరికాడు

'ఎల్ ఎస్ డి మాత్రలు మింగితే మతి భ్రమించుతుంది చర్చిలో దాక్కుంటే హాయిగా వుంటుందనిపిస్తుంది గాజు పలకలున్న కిటికీదాకా గోడమీదికి యెక్కాడు అక్కడి నుండి దూకుదామనుకున్నాడేమో అంతలో మనస్సు మారిందకాబోలు — దిగి వచ్చాడు గాజు తలుపులో నుంచి బయటికి ఒక్క దూకు దూకాడు' అన్నది ఈ తల్లి

గాలిలో ఎగరగలమనికూడా అనిపిస్తుంది ఎల్ ఎస్ డి మింగేవారికి

ఈ బాలుడు ఆస్పత్రిలో ఉన్నాడిప్పుడు మాత్రలు సంగతి ఎతితేసరి యిక పెదిమ విప్పడు 'స్నేహితులకు ఫోన్ చెయ్యాలి డబ్బులివ్వండి' అంటాడు ఆ స్నేహితులే యీ అమాయకుణ్ణి ఇట్లా చేశారని తల్లిదండ్రుల అభిప్రాయం

ఈ ప్రమాదం జరిగిన తరువాత ఆ 'మిత్రులలో' కొందరి ఆచూకీ తీసింది ఈ తల్లి కాని యేం ప్రయోజనం? అసలు సంగతి వాళ్ళు చెపితేగదా!

— వి ఎస్ అవధాని



తాడిగిరి పోతరాజు

సీరియల్



**జరిగిన కథ**

వెంకట్రామయ్యగారు హైస్కూలు సంస్థాపకులు ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాధ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు అప్తమిత్రులు పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికల్లో ప్రత్యర్థి వర్గంలోని కామయ్య మాష్టారి మీద శివరామయ్య నిందలమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు కర్తవ్యాన్ని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు కామయ్య. మధు శారదను తనతో వచ్చెయ్యమని ప్రాధేయపడతాడు శారద ప్రయాణానికి సిద్ధమవుతుండగా ప్రసాద్ వస్తాడు అంతా అర్థంచేసుకున్న ప్రసాద్ శారదను మధుదగ్గరికి చేర్చడానికి బస్సుఎక్కిస్తాడు

## 25

అప్పటివరకూ ఏదో మాట్లాడాలని తీవ్ర సంకల్పంతో అతనిని పిలిపించిన మాష్టారు ఏవిధంగా సంభాషణ ప్రారంభిద్దామా అని తికమకపడి పోయ్యాడు ఓనిముషంపాటు ఆలోచించి ప్రసాద్‌ను పరికించి చూస్తూ,

'కూర్చో...ప్రసాద్. .నేను ఈ విషయంలో చాలా ఆలోచించాను' అన్నాడు.

'ఏ విషయంలో నన్నట్లు' కుతూహలంగా ముఖం పెట్టుకొన్నాడు అతను.

'ఈ పెళ్లి తప్పిపోవటం మన మేలుకే జరిగింది ప్రసాద్ . . దిగులుపడకు...'అది' నీకు తగిన భార్యకాదు ... నేను చెబుతున్నానుగా'...

శారద పేరు ఉచ్చరించటానికికూడ అసహ్యమై పోయినట్లు ముఖం కందగడ్డలా చేసికొన్నాడు.

'ఈ విషయంలో నేనూ పొరబడ్డాను... ఒకవేళ పెళ్ళంటూ జరిగితే నీకు మనఃశాంతిలేకుండ పొయ్యేది ... అ పాపిష్టిది వెళ్లటమే మంచిది .దాన్ని మళ్లా నా గడప తొక్కనివ్వను...అది నాకూతురేకాదు ... నా పిల్లలు మీరిద్దరే ప్రసాద్ 'నీవూ... భాను' ... మీ రిద్దరూ నా కళ్లముందుండండి ... ' ఆయన కళ్లు అశ్రుసిక్తాలై గొంతు పూడుకుపోయి — తల ప్రక్కకు తిప్పుకొన్నాడు.

అహన్యామైన ఆ వింత ధోరణికి విస్తుపోయి కళ్లప్పగించి అలానే చూస్తుండిపొయ్యాడు.

'భానూ ... వయస్సులో చిన్నదైనా — బుద్ధి జ్ఞానం కల్గిన పిల్ల...అన్ని విధాలా నీకు తగినది.. '

పదిహేను రోజులుగా వెలుగుచూడటాని కిష్టపడక చీకటిలో క్రుంగిపోతూ దుఃఖంతో అవమానంతో కుమిలిపోతూన్న ఆయన మనస్సులో ఈ నూత్న సంకల్పం ఏ అజ్ఞాతమార్గాన ఎప్పుడు వచ్చిందో అతనికి అంతు చిక్కలేదు

ఏదో చెప్పాలని అతని హృదయం పెనుగులాడింది

మనసు మాటలు వెతుక్కోసాగింది.

వ్యాకులపాటుతో కళ్లెత్తి మాష్టారికేసి చూస్తూండిపొయ్యాడు కొద్దిసేపు

'భానూ పెళ్లి విషయం దిగులు పడకండి మాష్టారూ! ..నేనున్నాను...ఆ బాధ్యత నాపైపెట్టి మీరు నిశ్చింతగా ఉండండి... నేను ఈ బి.ఏ పూర్తి చేశాక ఏదైనా ఉద్యోగంలో ప్రవేశిస్తే.. మనకు ఏ దిగులూ ఉండదు...భానూ.. చదువు—పెళ్ళి. అన్నీ నాకు వదిలి వెయ్యండి'...

మాష్టారి ముఖం తెల్లబోయింది

కోపంతో వణికిపోతూ ... 'ఒరేయ్... ప్రసాద్...నీవు చెప్పింది నేను గ్రహించాను. ...సౌందర్యం శత్రువు...పైపై అందాన్ని చూసి మోసపోవద్దు'.. అన్నాడు

సంబంధంలేని ఆ మాటలు ఎవరి నుద్దేశించి పలుకుతున్నాడో—వాటి అంతరార్థమేమిటో అతను గ్రహించాడు ఆవేశంతో ఊగిపోతున్న మాష్టార్ని ఎలా ఉపశమింపచెయ్యాలో తోచలేదు

'మీరు నన్ను సరిగా అర్థం చేసికోవటంలేదు మాష్టారూ! శారదకున్న రూపం 'భానూ'కి లేదని నేను కాదనటంలేదు. . మీరు బాగా ఆలోచించండి 'భానూ'ని నేను ఎత్తుకొని తిప్పాను వయస్సులో, నాకన్నా, ఎంతో చిన్నది నేను భానూని' ..

అతని తిరస్కారంలో ఆంతరంగిక ప్రేమ —శుభాకాంక్ష-తప్ప మరేమీ లేకపోయినా— నిరాశతో దుఃఖంతో మూల్గుతూన్న మాష్టారి హృదయం దాన్ని సహించలేకపోయింది ఉద్యోగం ఊడిపోవటంవలన, ఆర్థికంగా చితికిపోయిన కారణంగా పరుల దృష్టికి తాను పలుచనై పొయ్యాననే భావం—పద్యం లోపం వలన వచ్చి రేగిన పుండులా విజృంభించింది.

తనంటే — తనకన్న కూతుళ్లకంటే కూడ, ప్రసాద్‌కు వల్లమాలిన గౌరవాభిమానాలని గుడ్డి నమ్మకముండేది ఈ సమాధానంతో, ఆ విశ్వాసం కాస్తా తల్లక్రిందులై పోయింది

అభిమానంతో కృంగి పొయ్యాడు.

ప్రసాద్ తన మాటను నిర్లక్ష్యం చెయ్యటం దుస్సహ మనిపించింది

'ఒరేయ్ ఈ 'తొల్లాయ్' కబుర్లు నా వద్ద చెప్పకు—భానూని పెళ్లి చేసికోవటం ఇష్టంలేదని ఒక్క మాటలో చెప్పు . తెలిపోతుంది ఎత్తుకొని తిప్పాను . చదువు పూర్తి కాలేదా ? .ఇవన్నీ నా కనవసరం...'

వాళ్ళ రువ్వినట్లు విసిరిన ఆ మాట లకు ప్రసాద్ గుండె తరుక్కు పోయింది

'ప్రసాద్—నేను నిర్మోహమాటంగా చెబుతున్నాను —ఉన్నదున్నట్లు చెబుతున్నాను నేను సమాజంలో ఏదో మార్పు తీసుకొద్దామని, ఎవరినో ఉద్ధరించాలనీ...నేను కులాంతర వివాహం చేసికొన్నాను...దాని ఫలితం ఇప్పు డనుభవిస్తున్నాను...ఎవరికిచ్చి భానూని కట్టబెట్టమంటావ్!...మగ పిల్లవాడయితే పోనివ్...వాడి బ్రతుకు వాడు సరిపెట్టుకొంటా డనుకోవచ్చు...ఆడపిల్ల...దీని సంగతెలా ... అదెలానూ వెళ్ళిపోయింది ... నా గుండెల్లో చిచ్చుపెట్టి...' ఆవేశంలో రెచ్చిపోయి కేక వేయసాగాడు.

ఆయన కళ్ళలో గడ్డకట్టుకు పోయిన దుఃఖం కన్నీరుగా మారింది. రెండు అశ్రు బిందువులు కను కొలకుల్లో నిలిచాయి.

ప్రసాద్ ముఖం వెల వెలా పోయింది. మాష్టార్ని పీల్చి పిప్పిచేస్తూన్న వ్యధలన్నీ తెలిసి ఉండీ కూడ తన మనసు నొప్పించినందుకు లోలోన బాధపడ్డాడు.

తండ్రి కేకలువిని 'భానూ' మునిగాళ్ళపై మెల్లగా నడిచివచ్చి వాకిలి చాటున నిలబడి వినసాగింది.

'వారికి మనసు బాగులేదు మాష్టారూ! ...జరిగిపోయిన వాటిని గూర్చి ఆలోచించి మనసు పాడుచేసుకోకండి... దానివలన వారి ఆరోగ్యం కూడ బాగా దెబ్బతింటోంది ... 'భానూ! పెళ్ళి విషయమై బెంగ పెట్టుకోకండి... నేను ... ఒక్క—నేనే కాదు ... కోటయ్య...భాస్కర్ — ఇంకా మీ అనుచరులు చాలామంది – ఉన్నారీ ఊళ్ళో... వాళ్ళందరూ ఎవరికివాళ్ళే తప్పుకు తిరుగుతున్నారని అభిప్రాయ పడవద్దు...మీరు... నామాట నమ్మండి...'

గదిలో చీకటి బాగా అలుముకోసాగింది. గబ్బిలాలు వెదురుబొంగు సందుల్లోనుండి బయటి కెగిరిపోతున్నాయి.

'నా కిప్పుడు ఎవరిమీదా ఆశల్లేవు ప్రసాద్...అందరూ స్వార్థానికి మనలను ఉపయోగించుకొనే వాళ్ళు...అవసరం తీరాక... దూరంగా తొలగిపోతారు ... సభ్యతకోసం చిరునవ్వుతో మనల్ని పల్కరించినంత మాత్రాన వాళ్ళకు మనమంటే ఎనలేని గౌరవమని పొరపడ కూడదు...వెళ్ళిపో ... నా కళ్ళముందునుండి '...కంపిస్తూన్న పెద వులతో చూపు [illegible] మూ పెట్టాడు

ఆయనలో కల్గిన ఈ ఆకస్మిక పరిణామాలను చూసి ప్రసాద్ కొయ్యబారి పోయ్యాడు ఏదీగా పలుకక [illegible] పై కెత్తుకొని మౌనంగా చూడసాగాడు.

'వెళ్ళిపో...ప్రసాద్ .వెళ్ళిపో ..నీవు నా ఇంట్లోనుంచి వెళ్ళిపో నేనూ ఇక్కడ్నుం



వెళ్ళిపోతాను ... ఈ ఊళ్ళో ఒక్క క్షణం ఉండను అందరూ అంతే. ఒక్కడికీ నీతి – నిజాయితీ లేదు .హృదయంలేని మను షులు విశ్వాస ఘాతకులు ఈఊరికి నేను చేసిన సేవకు నాకు వీళ్ళు చేసిన ప్రత్యుప కారం.. 'దొంగ'న్నారు. దగుల్బాజీ వెధవలు— దొంగముండా కొడుకులు చివరకు నన్ను 'దొంగ'నుచేసి నల్గురిలోనూ నిలబెట్టారు. ఈ వూళ్ళో ఒక్క క్షణముండను ... ఎవరి ముఖమూ చూడను వేరే ఎక్కడి కైనా వెళ్ళి చిన్న ఉద్యోగం చూసికొంటాను. లేకపోతే నాల్గు ట్యూషన్లు చెప్పుకొని బ్రతుకుతాను. .అంతే'...

ఆయన కోపంలో ఉండబట్టలేక మనసులోఉన్న ఆవేదనంతా వెళ్ళగక్కాడు తప్పు మొచ్చినట్లు నానాకూతలు కూశాడు

'ప్రసాద్' అలానే చేష్టలుడిగి నిలబడి పోయ్యాడు.

'నా కళ్ళముందు కనిపించకు వెళ్ళు. పో ముందిక్కణ్ణించి'.. అంటూ అక్కడ వంకీకు తగిలించిన పంట్లాం—చొక్కా అన్నీ లాగి ప్రసాద్ ముఖాన విసిరిపారేశాడు.

ప్రసాద్ వాటిని అందుకొన్నాడు

కళ్ళలో నీళ్ళు తిరిగాయి

మౌనంగా ప్రక్క గదిలోకి వెళ్ళి తన బట్టలన్నీ సంచిలో సర్దుకొని ఇవతలి కొచ్చాడు. ఆయన ఇంకా తిడుతూనే న్నాడు.

'వెళ్తాను .మాష్టారూ సెలవు' కంఠం గద్గదమైపోయింది. రెండు చేతులూ

# మట్టి బొమ్మలు

జోడించి వినయంగా నమస్కరించాడు.

'ఛీ ఛీ ఉండి నన్నుద్ధరించేదేమిటి? .. పో ఇదిగో ఆగు ఇది తీసికో వెంక ట్రామయ్యగారు నీ పేరిట దాచిన డబ్బు బాపతు కాగితం' అంటూ టేబిల్ లాగి ఆ కవరును నేలమీద విసిరికొట్టాడు.

ప్రసాద్ గుడ్లలో నీరు కక్కుకొంటూ అలానే స్తబ్ధంగా ఉండిపొయ్యాడు.

'తీసికో—తీసికోవేం ... మాష్టారు నా డబ్బు తిన్నాడని నాకు టాటాకులు కట్ట టానికా .తీసికొని. పో...మళ్ళీ నా గడప తొక్కవద్దు.'

ముఖమంతా చెమటతో తడిసిపోయింది ఆయాసంతో గుండె పట్టుకొని మరల కుర్చీలో కూలబడ్డాడు.

ప్రసాద్—గడప దాటాడు.

కాలు ముందుకు వెయ్యలేక ఆగి పొయ్యాడు—దుఃఖం ముంచుకొచ్చింది.

'హా' అనేవారు లేరు

తల్లీ—నాకిలి — లేదు ఇన్నాళ్ళూ పెరిగి పెద్దవాడయిన ఆ పంచను చటుక్కున వదిలి వెళ్ళలేక పొయ్యాడు

'వస్తా ..భానూ'... గుండె రాయి చేసికొని కాలు కదిపాడు.

'భానూ' తల ఊడించింది —గోటె వెంట మాట రాక. బుగ్గలపై కన్నీటిని తుడుచు కొని మూగదానిలా అతనిని అనుసరించి వాకిటి వరకూ సాగనంపి వచ్చింది.

అతని అడుగుల చప్పుడు సన్నగిలి పోయింది

ముందుకు కదిలిపోతూన్న అతని ఆకారం కూడ ఆ వీధి మలుపులో అదృశ్యమై పోయింది ఈ విషాద విషమ విశ్వపథంలో తన దారి తాను వెతుక్కుంటూ వెళ్ళి పొయ్యాడు.

అతను వెళ్ళిపోయిన తరువాత కూడ కాస్సేపు వాకిటివద్ద నిల్చి -వీధిలో మిణుకు మిణుకు మంటూన్న సంజదీపాల కాంతినీ. చీకటిలో కదులూన్న మానవాకారాలనూ అవలోకిస్తూండి పోయింది.

*　　*　　*

కాలచక్రం గిర్రున తిరిగిపోయింది.

ఒక సంవత్సరాన్ని చరిత్రలో కలిపి వేసింది

ఆ వేళ ఉదయం 'బస్ స్టాండ్' వద్ద దినపత్రిక కొరకు నిరీక్షించసాగాడు భాస్కర్. 'కాలుగాలిన పిల్లి'లా చిట చిట లాడుతున్న 'చిత్రాగ్ని'లో తిరగసాగాడు—మిత్రులను వెంట వేసికొని అందరి ముఖాల్లోనూ—ఆరాటం —ఆతురత తొంగి చూస్తున్నాయి చిన్న శబ్దమైతే చాలు—అందరి కళ్ళూ రోడ్డు కేసి చూస్తున్నాయి.

పది గంటల బస్సు దినపత్రికల కట్ట మోసుకొచ్చింది

విద్యార్థులందరూ కోలాహలంగా బస్సు చుట్టూ మూగారు 'యస్ యస్ యల్. సి' పరీక్షాఫలితాలున్న ఆ దినపత్రికలనందు కొని విద్యార్థులు గుట్టలు గుట్టలుగా చేరి వణుకుతున్న చేతివేళ్ళతో నంబర్లు వెతుక్కో సాగారు. తప్పిపోయిన విద్యార్థులు ముఖాలు వేలాడవేసికొంటున్నారు ,— 'ప్యా'సయిన వాళ్ళకు భూమిమీద కాలు ఆనటం లేదు.

భాస్కర్— ఒకటికి రెండుసార్లు జాగ్ర త్తగా చూశాడు

ముఖంపై ఆనందం తొణికిసలాడింది.

'ఇదిగో— నా నంబరు మనం — 'పా'సయ్యాం' .. అంటూ పట్టపగ్గాలు లేని సంతోషంలో చుట్టూ మూగిన మిత్రు లను ప్రక్కకు తోసికొంటూ, పెద్ద పెద్ద అంగలతో మాష్టారింటికేసి నడిచాడు

వీధిలో నుండే 'భానూ .భానూ'అంటూ పెద్దగా కేకలేసుకొంటూ లోనికెళ్ళాడు. 'పేపరొచ్చిందా? నేను ప్యాసయ్యానా?' కుతూహలం నిండిన కళ్ళలో ఆ






ఎంత వ్యత్యాసమో! మెరయుచుండే తెలుపు! నిష్కళంకమైన శుభ్రత! ఇది యెల్లముద్దల కొలదీ నురగ గల సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తివల్లనే మీ ఉతుకును చాలా సులభం చేస్తుంది. మీ బట్టలన్నిటినీ ఉతుకుటకు సర్ఫ్‌ను వాడండి ... పిల్లల బట్టలు, షర్టులు, చీరలు, ప్రతీదీ. సర్ఫ్‌తో ఇంట్లో ఉతుక్కొండి!

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

అమ్మాయి మధ్య గదిలోకి వచ్చింది.

'ఓ...నీవు— 'ప్యా'సే'కాకపోతే ఇంకెవరు ప్యాస'వుతారు మన ఇద్దరి క్లాసులో .. మనిద్దరమూ 'ప్యాసయ్యాం' .. గనబోసికొంటూ ఒక్క పెట్టున చెప్పుకు పోసాగాడు

'కావాలంటే చూసికో... నీనంబరు'... పేపరందించబొయ్యాడు.

'అమ్మో, నాకు ఒణుకు పుడుతోంది ... ఇవన్నీ, ప్యాసయిన వాళ్ళనంబర్లే .ఏదీ? . నా నంబరెక్కడ...చూపించు' అంటూ ఆ అమ్మాయి అతనికి అత్యంత సన్నిహితంగా జరిగి పత్రికలోకి తొంగి చూడసాగింది

పేపరు ఒక చివర 'భామా' చేతిలో ఉంది.

మరొక చివర 'భాస్కర్' చేతిలో ఉంది.

ఇద్దరూ ప్రక్కప్రక్కనే రాసుకొంటూ నిలబడి —స్నేహితులు—పరిచితుల నంబర్లు చూస్తూ గలగలమని నవ్వుకొంటున్నారు

బయట అడుగుల శబ్దం వినిపించింది

జీవితంలో తొలిసారిగా పెద్ద ప్రభుత్వ పరీక్షలో కృతార్థులై—వెర్రి ఆనందంతో తన్మయులై పోయిన వాళ్ళిద్దరూ అది గమనించలేదు.

మాష్టారు లోనికొచ్చాడు.

ఎండలో తిరిగి తిరిగి రావటాన కళ్ళ ముందు చీకట్లు కమ్మాయి చూపు ఆనటం కోసమై నొసటిపై చెయ్యి అడ్డం పెట్టుకొన్నాడు.

కళ్ళు గుచ్చిగుచ్చి చూశాయి.

దినపత్రిక వెనుక వాళ్ళిద్దరి శరీరాలూ చేరువగా ఉండి నవ్వుతూ—తుళ్ళుతున్నాయి.

ముఖాలుమాత్రం కనిపించటంలేదు.

ఆయన పిడికిలి బిగుసుకుపోయింది.

కనులు నిప్పులు కురిపించాయి.

అలికిడికి ముఖంనుండి పేపరు తొలగించుకొని ఆ అమ్మాయి తండ్రిని చూసింది ముఖం మరింత వికసించింది కట్టలు తెంచుకు వస్తూన్న ఆనందోద్వేగంతో వాకిట్లో నిలబడిన తన తండ్రికి ఎదురేగి

'నాన్నా నాన్నా నేను ప్యాసయ్యాను ... భాస్కర్ కూడా .. మే మిద్దరమూ 'ప్యాసయ్యాం' అంట్నూ అమాయకంగా కళ్ళు తిప్పుకొంటూ చెప్పుకు పోసాగింది

ఆయన కనుబొమలు ముడుచుకొని 'అలానా! .గుడ్' అని క్లుప్తంగా పలికి చేతిక్రరను మేకుకు తగిలించాడు.

'నేను — మా అమ్మా వాళ్ళకు చెప్పి వస్తా భామా,' అంటూ పేపరు తీసుకొని భాస్కర్ గడపదాటి పరుగెత్తాడు — మాష్టారు గోడవైపుకు తిరిగి లాల్చీ విడుచుకోసాగాడు

చింతాకులిత హృదయుడైన తన తండ్రిని ఈవార్త ఉబ్బి తబ్బిబ్బు చేస్తుందని— ఆయనకు ఇంకా ఏవేవోచెప్పి సంతోషింప చెయ్యాలనీ — ఆయన ప్రశంసలు అందుకోవాలనీ ఆమె హృదయం ఉవ్విళ్ళూరుతోంది.

'నాన్నా ... మరి ... నన్ను కాలేజీలో చేర్పించరా?'...కళ్ళు నోరగా తిప్పి గారాబంగా అడిగింది.

'ఊఁ ... మూల్గుతూన్నట్లు దీర్ఘం తీశాడు—అటుతిరిగి.

'కాలేజీకి—నాన్నా?' మరింత మురిపెంగా అడిగింది

'ఏమిటీ?' కళ్ళు ఉరిమాడు—తనకేసి తిరిగి 'భానూ' కంపించిపోయింది తండ్రి వైఖరిని చూసి — అప్పటివరకూ కళకళలాడుతూన్న ఆమె ప్రపుల్లవదనం నల్లబడిపోయింది.

· 'కాలేజీకి పంపరా—నాన్నా' .. మెల్లగా ప్రాధేయపూర్వకంగా అడిగింది

'దాన్ని పంపించినందుకు బాగా బుద్ధి చెప్పింది—నీవొకదానివి తయారయ్యావ్? .. మళ్ళీ నన్నుద్ధరించటానికి మళ్ళీ కాలేజీ— అనేమాట వినిపించిందో గొంతుపిసికి పారేస్తా . . చదివిన చదువుచాలు ... నోరు మూసికొని పడివుండు.'

తండ్రి మనస్తత్వాన్ని పరిశీలించి మాట్లాడటానికి సమయం కాదని నిర్ణయించుకొని మెల్లగా వంటగదిలోకి జారుకుంది చితికిపోయిన తమ కుటుంబ పరిస్థితులూ — ఆర్థిక దుస్థితీ—అన్నీ తెలిసుండీ కూడ తను తండ్రిని ఆవిధంగా కోరి మనసు నొప్పించినందుకు తనుతానే నిందించుకోసాగింది.

'భానూ' . ఆయన కంఠం కఠినంగా పిలిచింది వెంటనే.

.. ... ..

'భానూ,'. హాయిపెంచి పిలిచాడు.

జవాబివ్వకుండ భయంభయంగా మధ్య గదిలోకి వచ్చింది 'మాట్లాడవేం? తండ్రి పిలుస్తున్నాడనే భావనేలేదు ఎంత నిర్లక్ష్యం— ఎంతపొగరు '

తండ్రి కారణరహితంగా, తనపై లేని పోని అభియోగం మోపటం ఆమెకు వింతగా తోచింది—ఏమీ పాలుపోలేదు

'పిలిచిన వెంటనే — వస్తున్నా—నాన్నా,' భయంభయంగా సమాధాన మిచ్చింది

'రావటం విషయం — నేనడగటంలేదు— ఎందుకు పలకలేదు. అది నేనడిగేది? . చెప్పూ?' చిక్కి శల్యమైన ఆశరీరం ఆవేశంతో ఊగిపోసాగింది ప్రక్కటెముకలు— ఉచ్ఛ్వాశ— నిశ్వాసాలతోపాటు ఉబ్బిపోసాగాయి.

కోపావేశంతో తన తండ్రి ఇంతగా రెచ్చిపోటానికి తానుచేసిన తప్పు ఏమిటో ఊహించలేక కళ్ళు దించేసుకొని మౌనంగా



నిలబడింది.

'ఇదివరకులాటి నాన్నకాదిప్పుడు — నా మాట నిర్లక్ష్యం చేశావో చంపిపారేస్తా. చెప్పు కాలేజీకి వెళ్ళాలనే సంకల్పం ఎలా కలిగింది నీకు ... నిజం చెప్పు — ఏమీ అనను...చెప్పు'. ఆయన మాటను రెట్టించ సాగాడు.

తను ఏమి మాట్లాడుతున్నాడో అర్థం కానట్లు ఆ అమ్మాయి అనుమానంగా ఆయనకేసి చూడసాగింది.

'మాట్లాడవేం?'

'అందరూ వెళ్ళాలనుకొంటున్నారు నాన్నా మా బాచ్‌లో.. అందుకే .. మిమ్మల్నడిగేను' విపరీతంగా కలతపడుతూ సమాధాన మిచ్చింది

'బాచ్'—అంటే ... ఎవరెవరని అడుగు తున్నాను' ..

'సుజాత — విమల — అందరూ...' మేం కాలేజీకి వెళ్ళిపోతాం — నీవు కూడా రా' అంటే మానాన్ననడిగి చెబుతా' నన్నాను. ఎప్పటినుంచో అడుగుతున్నారు నాన్నా వాళ్ళు'

'భాస్కర్!...కాలేజీలో చేరమని సలహా ఇవ్వలేదా?' కోపంగా అధోకరకమైన చూపు చూశాడు.

'నాన్నా...'

పాలిపోయిన ముఖంతో ఒక అడుగు వెనక్కి వేసింది

'ఏమిటి నాన్నా!—మీరంటున్నదీ?'

'ఏమిటా? నంగనాచిలా మాట్లాడకు. మీరిద్దరూ నన్ను పిచ్చివాడ్ని చేశారు ... మీరు పిల్లలుకారు. నా పాలిట రాక్షసులు— పో.. నా కళ్ళముందునుండి.'

గుండెల్లో చెయ్యిపెట్టి కెలికినట్లయింది

ఒక్కక్షణం రక్తప్రసారం ఆగిపోయింది తీవ్ర భయోద్వేగంతో ఆ అమ్మాయి ఆపాద మస్తకం కంపించిపోయింది భయంకరమైన తుఫానుకు విసిరివేయబడినట్లు వెనక్కు తూలి బల్లిలా గోడను కరచుకొంది

'పో నా కళ్ళముందునుండి'. టేబిల్ పైనుండి పూలకుండీతీసి విసిరాడు.

పొంగివస్తూన్న దుఃఖాన్ని బలవంతాన ఆపుకొంటూ, పెదవి కరచిపట్టుకొని లోనికి పరుగెత్తింది ఆ అవమానం అత్యాచారం మౌనంగా భరించి లోలోన కుమిలిపోయి కుళ్ళి కుళ్ళి ఏడ్వసాగింది.

(ఇంకా వుంది)





# వారఫలం

## 29-9-1967 శుక్రవారం మొదలు 5-10-1967 గురువారం వరకు.

**మేషం** కొన్ని వ్యవహారాల్లో విశ్వాసంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలులభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలసంచలనం పెరుగుతుంది విదా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది దైవ కార్యాలు నెరవేరుతాయి

**వృషభం:** వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయాణాలు శ్రమమీద ఫలించగలవు స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి సాంఘిక వ్యవహారాల్లో గౌరవం బాగా ఉంటుంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి సంతోషకరమైన వార్తలను వింటారు

**మిథునం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు రావలసిన డబ్బు సమయానికి అందుతుంది కోర్టు వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది శుభ కార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**కర్కాటకం:** ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు పూర్తి చేయగలరు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి సాహిత్యకళారంగాల్లో విశేషకృషి రాణిస్తుంది. పెద్దల సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి నూతన విషయాలను తెల్సుకుంటారు.

**సింహం:** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు. బంధువుల వ్యవహారాల్లో శ్రమ పడినా, మాట దక్కదు.

**కన్య.** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ప్రయాణాలు వాయిదా పడతాయి ఉద్యోగంలో యెవరిని విశేషంగా నమ్మటం తగదు. మిత్రులసహాయం లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయంజరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాల్లో ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి సాహసముతోకూడిన వ్యవహారలులాభించగలవు స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి సాటివారితో మాట పట్టింపులు రావచ్చును.

స్త్రీలకు — ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి

**వృశ్చికం** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. సమయానికి యేదోఒక విధంగా డబ్బుచేతికి వస్తుంది ఉద్యోగంలో గౌరవంలభిస్తుంది ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి అలంకార వస్తువులు కొంటారు.

**ధనుస్సు** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు — ఆందోళన కలుగుతుంది ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం** పూర్తిగా నెరవేరే వరకు యేవ్యవహారాన్ని నమ్మడానికి అవకాశంలేదు వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. వ్యాపారంలో అనవసరమైన శ్రమకు గురికాగలరు ఉద్యోగంలో అపోహలకు గురికాగల ప్రమాదం ఉంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాసవస్తువులు కొంటారు.

**కుంభం** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానం చేయడం తగదు ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి వారం ఆఖరులో అనుకోని చికాకులు కలుగుతాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది అలంకారం కోసం వ్యయం చేస్తారు

**మీనం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి నూతనవ్యవహారాలు లాభించగలవు ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది సాటివారితో వాదప్రతివాదాలు తగవు

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు

—మహేష్


అబ్బే కథలపోటీవి కాదండీ-పోయిన సంచిక అట్టమీద బొమ్మ గురించి వచ్చిన ఉత్తరాలు!
ఎడిటర్
ఎడిటర్
రికమెండేషన్లు చెల్లవు


బావుంటే తప్పకుండా మా పత్రికలో వేస్తాం-మీరు చదివి వినిపించక్కర్లే-
అన్నాగా ఇక వెళ్లండి!
ఎడిటర్
రచయితలు తమ కథలు తిరిగిరావటానికి స్టాంపులు పెట్టకపోతేనే మాకు లాభం-చిత్తుకాయితాల ధర బాగా పెరిగింది..


ఎడిటర్
ఇది నేను రాసిన నవలలో ఒకటో భాగం-మీకు చూయిద్దామని తెచ్చా!
జయదేవ్




ఆకాశం నల్లగా ఉంది

సీతారత్నం కిటికీ ఊచలు రెండుచేతుల తోను పట్టుకుని నిలబడింది చూపులు బయటకి చూస్తున్నాయి మనసెక్కడో ఆలోచిస్తోంది ఉండి ఉండి అక్కడక్కడ ఆకాశంలో మెరపులు మెరుస్తున్నాయి సీతారత్నం మనసులో కోరికలులాగ.

'తనకి పెళ్లయిపోయి మూడు సంవత్సరా లయింది యీరోజుకి' ఆమె - మనసులో అనుకుంది 'పిల్లలు పుట్టలేదు తనకి' సీతారత్నం తనమీద తాను జాలిపడేలోగానే మనసు అడ్డుపడి సంతోషించమంది.

ఎందుకు? సీతారత్నం శరీరానికి నోరుంది మనసుకి లేదు చెప్పడానికి చల్లగా వానజల్లు కిటికీలోనుంచి ముఖంమీద పడింది సీతారత్నం పమిటచెరగుతో తుడుచుకుంది చేతివ్రేళ్ళ చీరలో ఉన్న చిరుగును పెద్దది చేసాయి.

వీధితలుపు దబదబా చప్పుడయింది

'ఆయన వచ్చారు' సీతారత్నం అనుకునే లోపుగానే తలుపు మళ్లా చప్పుడయింది. ఆమె గుండె లయగా దడదడలాడింది

'వినపడదా? గంటనుంచీ తలుపు కొడుతూంటేను' రమణ విసురుగా భార్యను తప్పుకుని లోపలికి వచ్చాడు.

సీతారత్నం మాట్లాడకుండా తలుపు మళ్లా గడియవేసింది.

'ఇవి తీసి అలమారులో పెట్టు.' రమణ చేతిలోని కాగితాలఫైలు మంచంమీద పడేసాడు

ఆమె మెల్లిగావంగి అవితీసి చేత్తో పట్టుకుంది

రమణ తడిసి శరీరానికి అతుక్కుని పోయిన చొక్కావిప్పి తలుపుమీద పడేసాడు.

'చాకలివచ్చి వెళ్లాడా?'

సీతారత్నం తల అడ్డంగా ఊపింది.

'ఈ చొక్కా వరండాలో ఆరబెట్టు. ప్రొద్దున్నే అదే వేసుకోవాల మళ్లీ'

ఆమె అది తీసుకుని వరండాలోకి వచ్చింది.

వానజల్లుకి నేలంతా తడిసి జీగురుగా పాదాలకి అంటుకుంటోంది చూరమ్మట వాననీరు ధారలుగా క్రిందకి పడుతోంది.

'వేడినీళ్లున్నాయా?'

'లేవు.'

'పెట్టలేదా యివాళ.'

'పుల్లలయిపోయాయి.'

'సరే యేదో ఒకటి. నామొఖానకొట్టు'

సీతారత్నం బకెట్‌తో నీళ్లు తీసుకువచ్చి వరండావారగా పెట్టింది. రమణ స్నానం చేసాడు

'తువ్వాలేదీ?'

సీతారత్నం తీసుకువచ్చియిచ్చింది.

'యింత తడిగా ఉందేం?

'వర్షం వచ్చింది'

'తెలుస్తూనేఉంది. యింట్లోకి తీసుకురావటం తెలియదు కాబోలు'

'మరచిపోయాను' అని ఆమె అనలేదు. అన్ని మాటలు ఉపయోగించడం సీతారత్నంకి అలవాటులేదు. ఎందుకు? అన్నా ఒకటే లేకపోయినా అంతే నిశ్శబ్దంగా అక్కడి నుంచి వంటగదిలోకి వెళ్లిపోయింది

'ఏమయినా ఉత్తరాలు వచ్చాయా?. రమణ భోజనానికి కూర్చుంటూ అడిగాడు'

'ఊహూ' సీతారత్నం నోటమ్మట శబ్దం రాలేదు

'మీ వాన్నదగ్గరనుంచి'

'లేదు'

'ఈ సారి పండగకి పిలవడు కాబోలు.

సీతారత్నం మాట్లాడటానికి ప్రయత్నించలేదు. శరీరభారాన్ని గోడకి ఆన్చి నిల

పడింది.

'ఈ కూరలో ఉప్పు తగలేయ్యలేదులా ఉంది చప్పగా యేడ్చింది'

సీతారత్నం ఒక క్షణం అలాగా అన్నట్లు కనురెప్పలు కదిల్చింది

నిముషాలు దొర్లిపోయాయి.

'చీరలు చిరిగిపోయాయి' ఈసారి సీతారత్నం తనంత తాను పెదవులు కదిల్చింది.

రమణ ఒకసారి తలయెత్తి చూసి మళ్లీ దించుకున్నాడు

'మీ నాన్న పండగకి పిలవకపోయినా బట్టలు పంపుతాడేమో! చూద్దాంలే తరువాత' రమణ లేచివెళ్లిపోయాడు

సీతారత్నం ఒకసారి దీర్ఘంగా విశ్వసించి శరీరభారాన్ని గోడమీదనుంచి తప్పించింది

రమణ భోజనం చేసిన కంచం కడిగేసి తనకి వడ్డించుకుని కూర్చుంది.

సీతారత్నంకి ఆకలిగాలేదు అయినా తినాలి యిప్పుడు భోజనం చేసేస్తే మళ్లా మర్నాడు మధ్యాహ్నంవరకూ చెయ్యనక్కరలేదు.

సీతారత్నం భోజనంచేసి వంటగదిఅంతా శుభ్రం చేసింది.

వర్షం వెలిసిపోయింది. బయట కీచురాళ్లు పండగచేసుకుంటున్నాయి కప్పలు పోట్లాడుకుంటున్నాయి

సీతారత్నం గదిలోకి వొకసారి చూసింది రమణ ఆఫీసు కాగితాలు ముందు పెట్టుకుని వ్రాసుకుంటున్నాడు

ఆమె మళ్లీ శరీరాన్ని గోడకి ఆన్చింది ఆ యింటిలో రెండుగదులున్నాయి.

ఒక వరండా ఉంది సీతారత్నంకి బాగా యిష్టమయిన స్థలాలు రెండు.

రమణ యింట్లో లేకపోతే ఆ గదిలో కిటికీ ప్రక్కన ఉంటే యింట్లో ఉన్నంతసేపూ వంటగది పొగ మూరినగోడ. చీర మాసిపోతుందని ఆమె ఎప్పుడూ అనుకోలేదు

రమణ కాల్చే సిగరెట్టుపొగ సీతారత్నం ముక్కు పుటాలికి ఘాటుగా తగిలింది క్రొత్తలో ఆమె ముక్కుకి చీరమడతలు అడ్డుగా పెట్టుకునేది

సీతారత్నం ఆవలింతకి చేయి నోటికి అడ్డంగా పెట్టుకుంది కాళ్లు కొంచెం పీకుతున్నట్లు అనిపించింది

మరి కొంచెంసేపు తరువాత గదిలో లైటు ఆరిపోయింది

సీతారత్నం కనులువిప్పి భారంగా నిట్టూర్చింది. ఆమె కాళ్లు అలవాటుగా చీకటిలోకి దారితీసాయి

ఆమె చేతికి మంచంపట్టె అడ్డుగా తగిలింది

దూరంగా ఎక్కడో గడియారం పదకొండుగంటలు కొట్టింది

మంచంమీద ప్రక్క బట్టలు వత్తుగా లేకపోవటంచేత సీతారత్నం నడుముక్రింద తెగిపోయిననవారు ముడి గ్రుచ్చుకుంటోంది,

ఆమె ప్రక్కకి జరిగింది రమణ మోచేయి చర్మం చల్లగా తగిలింది

సీతారత్నం మళ్లీ ముడిమీదకి జరిగింది

'చీకటి ఎంతో చల్లగా ఉంది' ఆమె అనుకుంది నిద్ర వచ్చినట్లేపోయింది కనులు విప్పి చూస్తూ పడుకుంది

'తనకి పెళ్లయిపోయి మూడేళ్లయిపోయింది' మనసు మళ్లీ గుర్తు చేసింది మూడేళ్ళలోనూ తన జీవితంలో జరిగిన పెద్ద మార్పులూ, గుర్తుంచుకోవలసిన విషయాలు ఏమీ మిగులలేదు ఒక్క తనికి వివాహం అయిపోయిందన్న మాట తప్పితే

పురోహితులు మంత్రాలు చదివారు ఆయన మెడలో తాళి కట్టారు తను ఎవరికో భార్య అయిపోయింది తనకి తెలిసిన విషయం అదే! అందరూ అన్నారు పెళ్లి అయిపోయిందని అక్షింతలు చల్లి ఆశీర్వదించారు లోకంలో ఎదిగిన ఆడపిల్ల లందరికీ పెళ్లి అవుతుంది తనకి కూడా అయింది

నాన్న చేతులమీద బరువు దించుకుని తృప్తిగా శ్వాస పీల్చారు

అంతే కాదు స్టేషనుకి దిగబెట్టడానికి వచ్చినప్పుడు కన్నీరు పెట్టుకున్నారు తనకి ఏడుపు రాలేదు అలాగే ఆయనవంక ఎదురుగా చూస్తూ ఉండిపోయింది

'అందంగా పెద్ద లేకపోయినా వికారంగా లేడు' అంది అమ్మ

'వియ్యే తప్పితే మాత్రం యేం? ఏదో ఉద్యోగం పర్వాలేదు భార్యని పోషించగలడు' అనుకుని ఉంటారు నాన్న.

తనేమని అనుకుంది? ఏమో! ఎవరడిగారసలు? తనకేం కావాలి?

ఏమో! కోరికలు మనసులో మంచులా పేరుకు పోయాయి. వాతావరణం హెచ్చుగా లేదు. మంచు కరగలేదు. మరింత గట్టిపడింది.

రమణ ఒకసారి దగ్గి లేచి కూర్చున్నాడు. సీతారత్నంలోని మనసు మళ్లీ నత్తగుల్లలోని నత్తలా ముడుచుకుపోయి ఎక్కడో దాక్కుంది ప్రక్కకి వత్తిగిల్లి కనులు గట్టిగా మూసుకుని పడుకుంది

'ఇదిగో మంచినీళ్లు ఎక్కడ పెట్టావ్?' రమణ సీతారత్నం భుజం పట్టి కుదిపాడు.

సీతారత్నం లేచి యిచ్చి మళ్లీపడుకుంది.

కిటికీలోనుంచి పడుతున్న ఎక్కడో దీపం వెల్తురు కూడా ఆరిపోయి చీకటి చక్కగా పేరుకుంది

సీతారత్నంకి శాంతంగా అందమయిన చీకటిలోకి చూస్తూ ఆలోచించే అవకాశం మిగులలేదు

'మళ్లీ తెల్లవారుతుంది' మనసు శరీరాన్ని విడిచిపెట్టి నిద్రపోడానికి ప్రయత్నించింది

* * *

'ఇదిగో!' రమణ అద్దంముందు తలదువ్వుకుంటూ పిలిచాడు

సీతారత్నం మంచం వానుకుని వెనకాల నిలబడింది చూస్తూ రమణ జుట్టు దువ్వెనకి లొంగకుండా తిరగబడుతోంది సీతారత్నం చూపులు బనియనులేని రమణ ఛాతీమీద నిలచిపోయాయి సన్నగా పీలగా ఉన్న శరీరం చుట్టూ బిగుతుగా చర్మం బిగించినట్టుగా ఉంది ప్రక్కటెముకలు బలంగా కన్పిస్తున్నాయి

సీతారత్నం బలవంతాన కనులు మరల్చింది.

'వెనకాలే ఉండి పిల్చినా పలకవేం?' రమణ ప్రక్కకి చూసి అన్నాడు

సీతారత్నం మాట్లాడకుండా లోపలికి వెళ్లి కారియరుతో తిరిగివచ్చింది

'కూరలున్నాయా?' అందుకుంటూ అడిగాడు

'లేవు'

'మరి చెప్పి చావకపోతే నాకెలా తెలుస్తుందనుకున్నావ్?'

సీతారత్నం బాధపడ్డట్లు యేమీ కన్పించలేదు మాట్లాడకుండా వంకెన ఉన్న సంచి తీసియిచ్చింది

రమణ వెళ్లిపోయాడు

'మళ్లీ రాత్రివరకూ రాడు' సీతారత్నం మనసు యేదో క్రొత్త రహస్యం చెప్పినట్లు అంది.

# మనిషిలో మనసు

సీతారత్నం వీధితలుపు గడియపెట్టి ఒక సారి గదంతా కలయచూసింది గది నిండా చిందరవందరగా ఉన్న సామాను ఎంతో సన్నిహితంగా చూసాయి. 'నిన్నటికి యీ రోజుకి తేడా యేమీలేదు రేపటిరోజుకి కూడా యేమీ ఉండదు' సీతారత్నం గది మధ్యగా గభాలున నేలమీదే కూర్చుంది ఎందుకో తనివితీరా గట్టిగా యేడ్వాలని అనిపించింది కాని ఆ బాధ పెదవివెనుక లోలోనే అణగారిపోయింది కంటినుండి ఒక బిందువు బుగ్గలమీదనుంచి జారి పెదవిని స్పృశించింది

'కన్నీటికి కూడా రుచి ఉంది ఉప్పగా ఉంటుంది,' ఆమె మనసు శరీరంమీద జాలిపడింది!

కాలం సీతారత్నం కోసం ఆగలేదు

'ఏమండీ' సీతారత్నం ఉలికిపడి ముఖాన కప్పుకున్న చేతులు తీసేసి చూసింది.

మళ్లీ ఎవరో పిలిచారు

సీతారత్నం చీరతో ముఖం తుడుచుకుని వంటగదిలోనుంచి వరండాలోకి వచ్చి చూసింది.

'మీ యింట్లో ఏమయినా తాళం చెవులు ఉంటే యిస్తారా?'

సీతారత్నం వచ్చినావిడని ఎగాదిగా చూసింది.

'నా పేరు నిర్మల మేము ఒకా ప్రక్క వాటాలోకి నిన్ననే వచ్చాం' ఆవిడ అంది

సీతారత్నం తెలుసన్నట్లుగా తల ఆడించింది

'యిల్లు మార్చే హడావుడిలో ఎక్కడో పారేసాను ముఖ్యమయినవన్నీ ఆ పెట్టెలోనే ఉన్నాయి' నిర్మల చుట్టూ చూస్తూ అంది

సీతారత్నం లోనికి వెళ్లి తీసుకువచ్చి యిచ్చింది.

నిర్మల అవి తీసుకుని హడావుడిగా వెళ్లి పదినిముషాలలో తిరిగివచ్చింది.

'తాళం వచ్చేసిందాండి?' అని సీతారత్నం అడగలేదు. తాళాల గుత్తి తీసుకుంది

'మొదటిదానితోటే వచ్చేసిందండి మీ రీ యింట్లో ఎన్నాళ్లబట్టి ఉంటున్నారు?' నిర్మల అడిగింది

సీతారత్నం జవాబు చెప్పలేదు 'లోపలికి రండి' అంది.

నిర్మల అంతా కలయజూస్తూ అడుగు లోపల పెట్టింది.

'కూర్చోండి' సీతారత్నం మూలనున్న జిడ్డుపట్టిన కుర్చీ ముందుకి లాగింది

గోడమీద రమణ ఫోటో చూస్తూ నిర్మల అడిగింది

'మీ . ' ఆమె పూర్తి చేయలేదు.

సీతారత్నం తల ఊపింది.

'మీ రిద్దరేనా?'

సీతారత్నం అవునన్నట్లుగా కళ్లు కదల్చింది

'మాకు కూడా పిల్లల గొడవలేదులెండి' నిర్మల ఎంతో పరిచయమున్న దానిలా నవ్వింది.

సీతారత్నం నవ్వడానికి ప్రయత్నించింది.

'మావారు అసిస్టెంటు యింజినీరు. నిర్మల, సీతారత్నం తన గురించి కూడా చెప్తుందేమోనని ఎదురు చూసింది

సీతారత్నం మాట్లాడక పోయేసరికి నిర్మల మళ్లీ అంది 'మీవారు ఏదో కంపెనీలో పనిచేస్తున్నారని యింటాయన చెప్పాడు'

'ఊ' సీతారత్నం పెదవులు కదిలాయి.

'ఎక్కడ?'

'నాకు తెలియదు'

నిర్మల ఆశ్చర్యంగా చూసింది.

'మీరు ఒక్కరేకదా? ఆయన వెళ్లిపోయిన తరువాత ఒంటరిగా కాలం ఎలాగ గడుస్తుంది?' నిర్మల అడిగింది

'గడవదు. కాని గడుస్తోంది' సీతారత్నం మనసు బిగ్గరగా అరవబోయి నోరు మూసుకుంది.

నిర్మల మరికొంచెం సేపు కూర్చుంది ఏదో అవీ యివీ అడుగుతూ

'మరి నేవస్తానండి. మళ్ళీ ఆయన వచ్చేస్తారు భోజనానికి' నిర్మల వెళ్లిపోడానికి లేచింది

'మీపనయిపోతే మా యింటికి రాకూడదూ చూడటానికి. మీకూ నాకూ కూడా కాలం గడుస్తుంది' గుమ్మం దగ్గర ఆగి వెనక్కి తిరిగి అంది

సీతారత్నం ఒక క్షణం సందేహించి బయలుదేరింది.

ఆ రాత్రి ఆమె చాలా ఆలస్యంగా నిద్రపోయింది.

'నిర్మల భర్త రాజారావు జుట్టు చాలా అందంగా ఉంటుంది వంకీలు తిరిగి కెరటాలులాగ.' సీతారత్నం మనసు రహస్యంగా చెవిలో గుసగుసలాడి నిద్రపోయింది చివరకి.

నిన్నటిరోజుకి యీరోజుకి తేడా ఉందని సీతారత్నంకి తెలియలేదు

*　　*　　*

'మీవారు నిన్నరాత్రి చాలా ఆలస్యంగా యింటికి వచ్చినట్లున్నారు ఎప్పుడూ అంతేనా?' నిర్మల చాకుతో ఆపిల్ ముక్కలు కోస్తూ అడిగింది.

'ఊఁ ఆఫీసు' సీతారత్నం సోఫా అంచు మీద కూర్చుంది తన చీర మకిలి దానికి అంటుకుంటుందేమోనని భయపడ్డట్టు

ఆమె వ్రేళ్ళు సోఫా మదృత్వాన్ని పరీక్ష చేస్తున్నాయి.



# ఎన్నో రకాలు ఎన్నుకోవడానికి

రేడియోలు మరియు ట్రాన్సిస్టర్లు రు. 125 లు మొదలుకొని వున్నాయి





మోడెల్ టిఏ 0816



మోడెల్ టిఏ 0581



మోడెల్ టిఏ 0579



మోడెల్ టిఏ 0509



మోడెల్ టిఏ/టియు 0777



మోడెల్ టిఏ 0926



మోడెల్ టిఏ/టియు 0202



మోడెల్ టిఏ/టియు 0776



మోడెల్ టిఏ/టియు 0824



మోడెల్ టిఏ 0366

వాటిని మీ స్నేహితుడైన మర్ఫీ డీలరు వద్ద యీరోజే చూడండి.

**murphy** మర్ఫీ మీ గృహానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

NAS 6192E

'ఏది బాగా ఎక్కువవస్తుందా' నిర్మల జాలిపడింది

సీతారత్నం మాట్లాడలేదు. చూట్టూ చూస్తూ కూర్చుంది. గోడలమీద వర్ణచిత్రాలు న్నాయి అందంగా గది మధ్యలో నేలమీద తివాచీ పరచారు. నలుచదరంగా సోఫాలు. వాటి మధ్య అందమయిన టీపాయ్.

'నిర్మల వాళ్ళు పడుకునే మంచం మీద నవారు ముడులు గ్రుచ్చుకోవులాగుంది.' సీతారత్నం అనుకుంది

'మా నాన్నగారు డిస్ట్రిక్ట్ మాజిస్ట్రేటు. అప్పుడు వరంగల్‌లో కొన్నాళ్ళు ఉన్నాం తరువాత ఏలూరు వచ్చిన తరువాత కారు కొన్నారు. మా వారిని కారు కొనమంటే పొడు! స్కూటర్ కొన్నారు' సీతారత్నం మాట్లాడటం లేదని నిర్మలకి తెంగలేదు. వింటేచాలు

'దీనికి అద్దె ఎంత?' సీతారత్నం అడిగింది

'నూటయిరవై' నిర్మల కళ్ళు మెరిసాయి

'అమ్మో!' సీతారత్నం గుండెల మీద చేయివేసుకుంది 'మా యింటికి నలభై'

'మరి మీకు యిల్లు సరిపోతుందా?'

'ఎక్కువయిపోతోంది!' సీతారత్నం తన లోనే అనుకుంది

'ఉండండి మాఫొటో ఆల్బమ్ చూపిస్తాను' నిర్మల ప్రక్కన ఉన్న డ్రాయరు లాగి పెద్ద ఆల్బమ్ సీతారత్నం చేతిలో పెట్టింది

'మీరెప్పుడయినా బొంబాయ్ వెళ్ళారా?'

'ఊహుఁ' సీతారత్నం తల అడ్డంగా ఊపింది.

# మనిషిలో మనసు

'అక్కడ తోచకపోవడం అనలుండదను కోండి మేము వెళ్ళినప్పుడు వానలు! అయినా టాక్సీలో తిరిగి అన్నీ చూసాం. అక్కడ మా మావయ్య వాళ్ళు ఒక యిల్లు కొనుక్కున్నారు ఎనభయివేలుట. కాని మా ఊర్లో యిల్లంత కూడా ఉండదు. పైగా పాత మోడలు!'

సీతారత్నం అన్యమనస్కంగా ఆల్బమ్ పేజీలు తిరగవేస్తోంది మొదటి పేజీలో నిర్మల, భర్త తీయించుకున్న పెళ్ళి ఫొటో కాపోలు ఉంది అన్నీ తరువాత నిర్మలవే నిల్చున్నప్పుడు, జడ వేసుకుంటున్నప్పుడు వంట చేస్తున్నప్పుడు, స్నానం చేసిన తరువాత తడిబట్టతో సీతారత్నం ఆశ్చర్య పోయింది

'మావారు తీసిన ఫొటోలే యివన్నీ, యింకా మేము హనీమూన్ వెళ్ళినప్పటివి ముందున్నాయి చూడండి' నిర్మల గబగబా పేజీలు త్రిప్పింది

'ఇది అమరావతిలో తీయించుకున్నాం యిదేమో కలకత్తా దగ్గర ఏదో 'లేక్ వ్యూ' పేరు అప్పుడే మరచిపోయాను ఊటీ నుంచి వచ్చేటప్పుడు మద్రాసులో ఆగాము. యిది పారిస్ కార్నర్.' నిర్మల ఒక్కొక్కటే చెప్పుకుపోతోంది.

'యిన్ని ఊళ్ళు ఎక్కడున్నాయి?' సీతారత్నం మనసు ఆశ్చర్యపడింది

'మీరు చూసారా? మేము అప్పుడు బొంబాయి వెళ్ళినప్పుడు 'అప్సరా'లో చూసాం ఆ పిక్చరు యిప్పుడు యీ ఊరు వచ్చింది.' నాకు మళ్ళీ చూడాలని ఉంది ఆయన్ని రమ్మంటే రానన్నారు మీరు నాతో రాకూడదు పిక్చరు చాలా బాగుంటుంది'

సీతారత్నంకి ఆ సినిమా పేరునుబట్టి హిందీయో, యింగ్లీషో కూడా తెలియలేదు.

'మీరు వస్తానంటే యివాళే ఫ్యాన్ చేత టిక్కట్లు బుక్ చేయిస్తాను'

'రేపు చెప్తాను' సీతారత్నం నోరు మెదల్చుకుని అంది.

'ఓఁ ఆయన్ని అడగాలా?' నిర్మల నవ్వింది

సీతారత్నం ఆల్బమ్ అట్ట అంచు వ్రేళ్ళతో పాముతూ ఉండిపోయింది చాలా సేపు గడిచిపోయింది నిర్మల ఏదో మాట్లాడుతూనే ఉంది సీతారత్నం చెవులు వింటూనే ఉన్నాయి మనసు ఎక్కడో ఏదో ఊహిస్తూ ఆలోచిస్తోంది.

వీధిలో స్కూటర్ ఆగిన శబ్దం వినిపించింది

'ఆయన వచ్చినట్లున్నారు' నిర్మల గభాలున లేచింది

సీతారత్నం లేచి నిలబడింది. నిర్మల వంటగది గుమ్మంవరకూ కూడా వచ్చి మళ్ళీ వెళ్ళిపోయింది

సీతారత్నం ఒకక్షణం అక్కడే నిలబడింది ఎందుకో ఆమె మనసు ఒకక్షణం తటపటా యించింది—

మరుక్షణం దగ్గరగాఉన్న తలుపు రెక్కల సందులోనుంచి చూసింది నిర్మల తన రెండుచేతులూ రాజారావు కంఠం చుట్టూ పెనవేసి నిలబడి ఏదో అంటోంది.

సీతారత్నం హృదయం వింతగా కొట్టు కుంది. అడుగులు త్వరగావేస్తూ తమ వాటాలోకి వచ్చేసింది

'నిర్మల, రాజారావు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారట' సీతారత్నం కిటికీలోనుంచి చూస్తూ అనుకుంది

మరోక అరగంట తరువాత రాజారావు, నిర్మల నవ్వుకుంటూ బయటికి వచ్చారు. రాజారావు యింటికి బయట తాళం వేస్తున్నాడు నిర్మల చుట్టూ చూసింది

సీతారత్నం శరీరం ప్రక్కకి జరిగింది.

రాజారావు వెనకాల నిర్మల స్కూటర్ ఎక్కి కూర్చుని అతడి నడుముచుట్టూ



తేయిచుట్టింది.

'అలా పట్టుకోకపోతే పడిపోతారేమో !' సీతారత్నం అనుకుంది

రాత్రి భోజనంచేస్తూ ఉండగా రమణ పిలిచాడు. ఆమె పలికిందో లేదో ఆమెకే తెలియదు.

రమణ వంటగది గుమ్మందాకొవచ్చి ఏదో పొట్లాం ప్రక్కన పడేసాడు సీతారత్నం తలప్రక్కకి త్రిప్పిచూసింది

పొట్లాం సందులలోనుంచి చేమంతి పూలరేకులు తొంగిచూస్తున్నాయి

సీతారత్నం భోజనం పూర్తిచేసేసి పువ్వుల పొట్లాం తలుపుతీసి మొక్కల మధ్యకి చీకటిలో విసిరేసి ఏడ్చింది

రమణ పువ్వులు పెట్టుకోలేదేమని భార్యని అడగలేదు అతనికి తెలియదు ఆమె పెట్టుకోలేదని అతను అవన్నీ చూడడు అవసరంలేదు ప్రక్కనున్న వాళ్లెవరో కొంటూ ఉంటే తనూ కొన్నాడు.

రమణకి రక్తంలో వెచ్చదనం ఉంది మనసుకి లేదు.

'నిర్మల చాలా కలుపుగోలు మనిషి డబ్బున్న గర్వంలేదు రాజారావుకి ముఖం మీద స్ఫోటకం మచ్చలులేవు' సీతారత్నం నిరంతరం సిగరెట్ల వేడికి కమిలి మృదుత్వం కోల్పోయిన పెదవుల స్పర్శను తప్పించుకోడానికి ప్రయత్నిస్తూ అనుకుంది.

* * *

అర్ధరాత్రి అకస్మాత్తుగా మెలకువ వచ్చింది సీతారత్నంకి

కిటికీలో నుంచి వెన్నెల పాలవెల్లులా నేలమీద పడుతోంది సీతారత్నం మెల్లిగా మంచం మీదనుంచి లేచి వరండాలోకి తలుపు తీసి నిలబడింది.

రమణ నోటి నుంచి చిన్న గురక వస్తోంది.

సీతారత్నంకి ఆ క్షణంలో ఎక్కడికయినా పారిపోతే బాగుండుననిపించింది ఆమె కాళ్ళు మెల్లిగా దొడ్లో మొక్కల మధ్యకి దారితీసాయి

వెన్నెల జల్లులా ప్రతి ఒక మొక్కను, ఆకును పలకరించి పులకింపచేస్తోంది 'తనకి పెళ్ళికాక ముందు వెన్నెల రాత్రి అసలు నిద్రపోకూడదు అనుకునేది' సీతారత్నంకి జ్ఞాపకం వచ్చింది అప్పుడు బ్రతుకంతా పండు వెన్నెలగా ఊహించుకుని ఆనందించింది.

యిప్పుడు వెన్నెల తనని భయపెడుతోంది ఒంటరితనంతో వెన్నెల కాస్తూనే ఉంది నెలకొకసారి పున్నమి పలుకరించి పోతూనే ఉంది. తన మనసు ఉప్పు రుచి చూసిన పాలలాగ విరిగిపోతోంది చివరకి ఏం జరుగుతుంది? కొన్ని యేళ్ల తరువాత తన శరీరం చచ్చి పోతోంది. ఆయన స్వయంగా కొరివి పెడ్తారు. తన కోసం యేడుస్తాడా? తనకి తెలియదు ఎప్పుడు వస్తుంది ఆ స్వేచ్ఛ?

బహుశ మృత్యువు కౌగిలి యింకా వెచ్చగా ఉంటుందేమో! యముడు కూడా బొమ్మలలో అందంగానే ఉంటాడు సీతారత్నం అర్ధంలేకుండా పిచ్చిగా ఆలోచిస్తోంది 'నాన్న, అమ్మ వచ్చి చచ్చిపోయిన శరీరం మీదపడి యేడుస్తారు తనకి అప్పుడెంతో ఆనందంగా ఉంటుంది ఎందుకో రమణ కూడా తనకోసం యేడిస్తే చూడాలని ఉంది' సీతారత్నం చేతో ఒక చిన్న మొక్క ఆకు త్రెంపి ప్రక్కకి పారేసింది

'చీకటిలో యేం చేస్తున్నావ్? ఎవరయినా చూస్తే భయపడతారు.' రమణ గుమ్మంలో నుంచి పిలిచాడు.

'నిర్మలా వాళ్ళువచ్చి నెలవాటింది' సీతారత్నం అనుకుంటూ లోపలికివచ్చి పడుకుంది

* * *

ప్రొద్దున్న పది గంటలయింది రమణ ఆఫీసుకి వెళ్లిపోయి గంటయింది. సీతారత్నం కుళాయి దగ్గర బట్టలుతుకుతోంది 'నాన్న పండుగకి పిలిస్తే బాగుండును. కొన్ని రోజులుండి రావచ్చు.' అనుకుంది.

సీతారత్నం ముక్కుకి పాలు పొంగిన వాసన వేసింది 'నిర్మలా వాళ్లింట్లో కాబోలు' అనుకుంది పది నిముషాల తరువాత ఆమె పని పూర్తయింది. యింకా వాసన వేస్తూనే ఉంది

సీతారత్నం చేతులు కడుక్కొని లేచి వెళ్లింది 'మీ యింట్లో పాలు పొంగి పోయినట్టున్నాయ్ నిర్మలగారూ' వంట గదిలో ఎవరూ లేరు స్టౌ మీద పాలు గిన్నెలోనుంచి పొంగి పొర్లి పోతున్నాయి అంచుల మీదనుంచి ప్రక్కకి

సీతారత్నం గిభాలున పాలు దింపేసింది.

'ఎవరూ ?'

సీతారత్నం వెనక్కి తిరిగి చూసింది రాజారావు గుమ్మంలో నిలబడ్డాడు నడుము చుట్టూ టర్కీ టవలు అప్పుడే స్నానం చేసిన గుర్తుగా ఛాతీ మీద నీటి బిందువులు మెరుస్తున్నాయి

'పాలు పొంగి పోతేనూ..' సీతారత్నం కంగారుపడింది

'నిర్మల ఊళ్లో లేదు ప్రొద్దున్నే వాళ్ల నాన్నగారికి వంట్లో బాగాలేదని తెలిసి బెజవాడ వెళ్లింది' రాజారావు చెప్పడం పూర్తి కాలేదు

సీతారత్నం యింక విన్పించుకోలేదు. వెంటనే గబ గబా బయటకి వచ్చేసింది

'పాపం తనే వంట చేసుకోవాలి కాబోలు.'



తారత్నం జారి పడింది.

మరునాడు కుళాయి దగ్గర బిందెలోకి నీరు పడుతూ అవాలోచితంగా చుట్టూ చూసింది

రాజారావు వంట గది కిటికీలోనుంచి చూస్తున్నాడు తీక్షణంగా సీతారత్నం బిందె నడుముకి యెత్తుకుని నడిచింది. కొంతమేర జాకెట్టు, నడుము క్రింద భాగం తడిసి చల్లగా అనిపించింది. అడుగులు తమ యింటి వైపు వడి వడిగా వేస్తూనే ఒకసారి వారగా చూసింది రాజారావింకా అక్కడే నిల్చుని చూస్తున్నాడు

ఆ రోజునుంచి వరుసగా నాలు గయిదు రోజులు సీతారత్నం అదే టైముకి నీళ్లు పట్టుకోడానికి వెళ్లింది రాజారావు ప్రతీ రోజూ చుట్టుప్రక్కల కనపడుతూనే ఉండే వాడు

ఒకరోజు సీతారత్నం అతనివైపు చూసి నప్పుడు నవ్వాడు

'జాకెట్టు భుజం కింద చిరిగిపోయింది కుట్టుకోవాలి' సీతారత్నం అనుకుంది ఆ మరువాడు సీతారత్నంకి రాజారావు కనపడ లేదు

'రాజారావు నవ్వితే ఆడవాళ్లలాగ బుగ్గ మీద సొట్టపడుతుంది' సీతారత్నం అనుకుంది.

రెండురోజుల తరువాత రాజారావు మళ్లా ఆమెకేసి చూసి నవ్వినప్పుడు సీతారత్నం కూడా చిన్నగా నవ్వి తలదించుకుంది

రాజారావు వంట గదిలోనుంచి బయటకు వచ్చాడు

'నీళ్లన్నీ మీరే మోయాలా ? పనివాడు లేడా ?'

'లేడు.'

'రేపటినుంచి మా ప్యూన్‌తో చెప్తాను. వాడు తేసి పెడతాడులెండి.'

సీతారత్నం మాట్లాడకుండా నిల్చుంది. నీరు బిందె నిండిపోయి పొర్లిపోతోంది

'ఆవిడ ఎప్పుడు వస్తారు?' రెండు క్షణాలతరువాత అడిగింది.

'ఎవరు నిమ్మియేనా ? పుట్టింటికి వెళ్లిందిగా. యింక నేను గుర్తుండను. తనయిష్టం.' రాజారావు నవ్వాడు.

సీతారత్నం బిందెయెత్తుకుని వెళ్లి పోయింది.

'జాకెట్టు చిరుగు పెద్దదయిపోతోంది

# మనిషిలో మనసు

వెంటనే కుట్టుకోవాలి' సీతారత్నం నిశ్చయం చేసుకుంది. కాని యిల్లంతా వెతికినా సూది, దారం కనపడలేదు

సీతారత్నం ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి వెదకడం మానేసింది

మరునాడు రాజారావుని సీతారత్నం చూసినప్పుడు రెండువ్రేళ్లకి కట్లు కట్టాడు.

'నిన్న గిన్నె కాలింది' ఆమె అడగకుం డానే చెప్పాడు.

సీతారత్నం ఆకాశంకేసి చూసింది ఎండపోయి మబ్బులు సూర్యుణ్ణి ఆక్ర మించాయి 'వర్షం వస్తుంది' ఆమె పెదవులు కదిలాయి

'రమణగారు ప్రొద్దున్న వెళ్లి మళ్లీ రాత్రివరకూ రారా?' రాజారావు అడిగాడు.

సీతారత్నం అతని ముఖంలోకి ఒకక్షణం చూసింది.

'నిమ్మికూడా లేదు మీ ఒక్కరే నను కుంటా పాపం' రాజారావు జాలిపడ్డాడు.

'మీరు వంటచేసేసుకున్నారా?' సీతా రత్నం పెదవులు కదిల్చింది వర్షం పెద్ద చినుకులు పడటం ప్రారంభించాయి

'అన్నీ అయిపోయాయి అన్నం ఉడికింది కాని స్టౌ మీదనుంచి దింపడానికి భయంగా ఉంది' తన కాలినవ్రేళ్లు చూపించి రాజారావు నవ్వాడు.

'నేను దింపుతాను' సీతారత్నం అతని వెనకాల వంటగదిలోకి వెళ్లింది

వర్షం కొంచెం ఎక్కువయింది

'పెద్ద వర్షం అకస్మాత్తుగా వచ్చేస్తే బాగుండును' సీతారత్నం పట్టకారుతో గిన్నె క్రిందకు దింపి అనుకుంది

నిజంగానే వర్షం పెరిగి పెద్దదయి పోతోంది.

'వర్షం బాగా కురుస్తోంది' రాజారావు అన్నాడు.

సీతారత్నం మాట్లాడలేదు. గదంతా అకస్మాత్తుగా వేడెక్కిపోయినట్లనిపించింది

'వర్షం తగ్గాక వెళ్లవచ్చు అంతవరకూ ముందు గదిలో కూర్చుందాం రండి యిక్క డంతా పొగ వాసన' రాజారావు అన్నాడు.

సీతారత్నం కాళ్లు కదల్చలేదు. ఏదో నిర్లిప్తంగా వర్షపు ధారలకేసి చూస్తూ ఉండిపోయింది.

'అయిదు నిముషాలు నిశ్శబ్దం మెల్లిగా ప్రాకింది. సీతారత్నంకి రాజారావు అంతసేపూ తన వైపే చూస్తున్నాడని తెలుసు.

'మీరు చాలా అందంగా ఉంటారు.' రాజారావు దగ్గరగా వచ్చాడు

సీతారత్నం శరీరం ఝల్లుమంది రక్తం చలికి గడ్డ కడుతుందేమో ననిపించింది

ఆమె కనులెత్తి అతనికేసి తీక్షణంగా చూసింది

అతను నవ్వాడు ఆమె అలాగే చూస్తూ ఉండిపోయింది ఆమె చూపులో భావం నిశ్చయంగా లేదు

'సీతారత్నంకి కోపం రాలేదు' రాజారావు అనుకున్నాడు

సీతారత్నంకి ఆ సమయంలో తన మంచం మీది నవారు ముడి గుర్తుకి వచ్చింది

రాజారావు మరింత దగ్గరగా వచ్చాడు. ఖరీదయిన సెంటు వాసన ఆమె ముక్కు పుటాలు నిండింది

మరుక్షణం సీతారత్నం ధారగా కురుస్తున్న వర్షంలోకి పరుగెత్తింది ఒక్క పరుగులో గదిలోకి వచ్చేసి తలుపు లోపల గడియ పెట్టేసింది

చీర, జాకెట్టు పూర్తిగా తడిసి పోయాయి నీరు అంచులమ్మట కారుతోంది. అలాగే మంచం మీద బోర్లగిలా పడుకుంది. మనసు ఏదో మత్తుగా తేలిపోతోం దనిపించింది

'తను అందంగా ఉంటుందిట' సీతా రత్నంకి రాజారావు మాటలు చెవిలో ప్రతి ధ్వనిస్తున్నాయి. యింతవరకూ పుట్టిన తరువాత ఎవరూ తనతో ఆ మాట అన లేదు రమణకి తను అందంగా ఉన్నా లేక పోయినా ఒకటే తను ఒక స్త్రీ అని తెలుసు పైగా తన భార్య అని కూడా తెలుసు

సీతారత్నం జుట్టు మీదనుంచి నుదుటి మీదకి జారిన నీటిని తుడిచింది

ఎండిపోయిన ఎడారిలాంటి ఆమె మనసు మీద ఒకే ఒక నీటి బొట్టు పడినట్టుగా ఉంది 'తనని ఎవరో ఒకరు మనిషిగా గుర్తించారు. అంతే చాలు.' సీతారత్నం శరీరం తృప్తితో బరువెక్కింది.

'పాలు పూర్తిగా విరిగిపతతుంతతూతా నీటిని వేరుచేస్తే క్రొత్తరుచిగా ఉంటుంది.' సీతారత్నం తనలో తనే నవ్వుకుంది. ఆమె

మనసుతో ఆలోచన ఒకపద్ధతి, కట్టుబాటు అనే పరిధిలో చిక్కుకోడానికి యిష్టపడలేదు

'రాజారావు నిర్మలను 'నిర్మా' అని పిలుస్తాడు పెళ్లిచేసికొని ఉంటే 'సీతా' అని పిలుస్తాడేమో!' సీతారత్నం పిచ్చిగా ప్రక్కమీద దొర్లింది.

మనిషి కోరికకి బానిస మనసును తృప్తిపరచడం కష్టం. శరీరాన్ని సుఖింప చేయడం సులభం. ఒక్కొక్కసారి శారీరక తృప్తినే మానసిక తృప్తిగా భావిస్తాడు మనిషి కోరికకు నీతి, నిజాయితీ అనే నియమం లేదు పదిమంది అవినీతి అనేదాని మీద కోరిక గలిగితే తన మనసుకికూడా తెలియకుండా చాటుగాచేస్తాడు అంతే తేడా

తెల్లవారింది సీతారత్నం రోజూకంటె ముందులేచిపోయింది ప్రక్కమీదనుంచి రమణ మామూలుగా ప్రొద్దున్నే వెళ్లిపోయాడు. సీతారత్నం తలారా స్నానంచేసి వదులుగా జడ అల్లుకుంది క్షణాలు తీగలు సాగి యుగాలయి పోతున్నాయనిపించింది దొడ్లోనే అవీయివి వెతికి చివరికి ఏవో గడ్డిపూలన్నీకోసి మాలకట్టింది హృదయం అపస్వరాలన్నీ ప్రోగుచేసి సంగీతం అని మనసుని భ్రమపెట్టి ఆనందింప చేస్తోంది

'ఛీ! పాడు అద్దం సరిగా కనపడటం లేదు' సీతారత్నం తడిగుడ్డతో పాత అద్దాన్ని జిడ్డుపోయేదాకా తుడిచింది

ఈసారి కొంచెం ముఖం స్పష్టంగా కందనిపించింది

'నిర్మలకన్న తనే అందంగా ఉంటుంది నిర్మలకి ముందుపళ్ళు ఎత్తుగ ఉంటయి!

'నిన్న తను అలా ఒకస్కారి పరుగెట్టుకుని వచ్చేస్తే రాజారావు ఏమనుకున్నాడో!'

సీతారత్నం ఆలోచనలు తేనెటీగల్లా నిశ్చలతలేకుండా ఎగిరిపోతున్నాయి.

'అమ్మా!'

సీతారత్నం తిరిగి చూసింది

'అయ్యగారీ కాగితం మీకియ్యమన్నారండి' రాజారావు నౌకరు ఆమె చేతికిచ్చాడు

సీతారత్నం కాగితం మడతలు విప్పింది

'నిన్న మీతో అసభ్యంగా ప్రవర్తించినందుకు విచారిస్తున్నాను మీరు కొన్ని క్షణాలు ఆగి ఉంటే నేను పతనమయి ఉండేవాడిని, మీకు మచ్చ మిగిలిపోయేది మనస్ఫూర్తిగా క్షమించమని ప్రార్థిస్తున్నాను.'

అంతకంటె మరేమీలేదు ఆ కాగితంలో.

సీతారత్నం ప్రతిమలా నిలబడింది కనులు పదేపదే నిర్జీవంగా ఆ కాగితంలోని అక్షరాలను ఉచ్ఛరించాయి.

ఒక్కసారి మంచువేసవిలాంటి వాతావరణం ధ్రువప్రాంతంలోని శీతలంని మించిపోయినట్టుగా మారిపోయింది.

'యిలాగ ఎందుకు జరిగింది?' సీతారత్నం మనసు పదేపదే ప్రశ్నిస్తోంది

'అమ్మగారు వస్తున్నామని టెలిగ్రాం యిచ్చారు అయ్యగారు స్టేషనుకి వెళ్లారు' నౌకరు చెప్పి వెళ్లిపోయాడు

సీతారత్నం శరీరం స్వాధీనం తప్పి ఆ మాటలు వినలేదు. విన్నా అర్థం చేసుకునే స్థితిలో లేదు.

లేకపోతే రాజారావు అలాగ ఎందుకు చేసాడో అర్థమయి ఉండేది ఆ రాత్రి సీతారత్నం బక్కచిక్కిపోయిన రమణ దేహాన్ని దృఢంగా కౌగలించుకుని యేడ్చేసింది

రమణకేమి అర్థం కాలేదు 'ఛ! ఛ! యేమిటి? ఎందుకేడ్పు? వంట్లో బాగో లేదా?' మెల్లిగానే అడిగాడు

సీతారత్నం మరింత సన్నిహితంగా అల్లుకుపోయింది రమణకి అంతా అయోమయంగా అనిపించింది భార్య శరీరం ఎప్పటికన్న ఎక్కువ వేడిగా ఉన్నట్లనిపించి ఆనాలోచితంగా తను కూడా తగ్గరగా హత్తుకున్నాడు.

సీతారత్నం యేడుపు యింకిపోయింది.

'గుండెల మధ్య మంగళసూత్రం అడ్డం గుచ్చుకుంటూ బాధ అనిపించింది' సీతారత్నం సర్దుకోడానికి ప్రయత్నించలేదు.

మరునాడు సీతారత్నం ఆత్మహత్య చేసుకుంది.

* * *

'ఎలాగ ఉంది?' కాశీపతి ముఖంలో భావాలు మారిపోతూండగా అడిగాను నేను

'సీతారత్నం ఏ కారణంగా చనిపోయింది? అసంతృప్తా లేకపోతే పశ్చాత్తాపమా? నీ మనసులో విషయం పూర్తిగా వ్యక్తం చేయలేక పోయావనిపిస్తోంది చదివేవాళ్ల సానుభూతి సీతారత్నంకి పోతుందేమోనని నీవు అనుక్షణం భయపడ్డావు అవునా?' కాశీపతి నా మనసుము దూసుకు పోయేలా ప్రశ్నించాడు

నేను వెంటనే మాట్లాడలేక పోయాను

'పోనీలే కాని సీతారత్నం చనిపోవడానికి కారణం నీకేమని తోచింది?' నేను అడిగాను

కాశీపతి మళ్ళా ఒకసారి కాగితాలు వెనక్కి తిరిగేసి చూసాడు

'నాకు మాత్రం ' కాశీపతి పూర్తి చేయలేదు 'నువ్వు వట్టి పిరికివాడివి.' మధ్యలో ఆగిపోయి అన్నాడు

నా మనసు త్వరగా అంగీకరించలేకపోయింది ●



## జరిగిన కథ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. రమణ భర్త వెంకట్రావు. పార్టీ రాజకీయాలతో విరోధివర్గాలయిన కుటుంబాలు వాళ్లవి. సెలవుల నెపంమీద వేణు సుశీలను చూడ్డానికి జ్యోతి యింటికి వెళ్తుంటాడు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు. కాలేజీలో వేణుకు ఉషతో పరిచయమవుతుంది జ్యోతి సుశీలను గురించి ఉత్తరం రాసి వేణుకు కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తుంది.

## 23

రోజులు గడుస్తున్నాయి ... ఎలక్షను ప్రచారం ముమ్మరంగా సాగిపోతోంది. ఇరువైపులా చాలాపట్టుదలతో ప్రచారం చేస్తున్నారు ..ఇక ఎలక్షను పోలింగ్ వారంరోజులుందనగా ఓరోజు ప్రొద్దుటిపూట హడావుడిగా పరుగెత్తుకు వచ్చాడు రవణయ్య ..

'ఇంకేముంది!.. కొంప మునిగింది! ..' అంటూ...

'ఏం జరిగింది బాబాయి ? ' ఆదుర్దాతో అడిగాడు ఆనందరావు ..

'ఏముంది!...ఆవెంకట్రావు మనవార్డులో కొచ్చి ప్రచారం చేస్తున్నాట్ట. రాత్రి మేదర వీధికొచ్చి, యింటింటికీ వెళ్లి, ఏదో ఆశపెట్టి ఓట్లు సంపాయిస్తున్నాట్ట మేదర వీధిలో సగానికి సగం మంది వెంకట్రావు పక్షం వాళ్లకే ఓట్లు వేస్తామని.. ఖాహాటంగా చెబుతున్నారటకూడా...'

'నిజంగానా బాబాయి!... మన మేదర వీధిలో కొచ్చాడా వెంకట్రావ్ ? ..'

'నిజమయ్యా!. పచ్చినిజం. కావాలంటే కున వీరన్న వడుగు...'

'ఏం వీరన్నా!... వెంకట్రావు అంత నిర్భయంగా మన వీధిల్లోకే వస్తున్నాడా ?.. '

'అవునయ్యా రేతిరొచ్చారట ఎవరెవరో నలుగురొచ్చారుట మొత్తం.. 'ఇయ్యాలరేతిరి కూడా వత్తారట ఆళ్లను కుంటుండ్రు '

'ఊఁ ఎన్నిగుండెలొచ్చాయి వెంకట్రావుకి! .' కోపంతో వూగిపోతూ అన్నాడు ఆనందరావు .

'ఆనందరావు యింకా బ్రతికే వున్నాడు!, అయితే అప్పుడేవచ్చి నాతో చెప్పలేదేం వీరన్నా? '

'అంతరేతిరికాడ మీారు నిద్దరబోతుం

# సీరియల్

# పూర్వా సంధ్యా ప్రవర్తతే...

### తేజోవతి

టారని .. సందేయించాను. అయ్యా... ఇయ్యాల రేతిరికూడా వత్తారంట...'

'అయితే యివ్వాళ రాత్రికి నువ్వూ, మీావాళ్ళు అంతా మన వీధులన్నిట్లో కాపలా కాయండి...అవసర మొస్తే నాకు కబురు చెయి ... ఇంద యీా డబ్బు తీసుకుని మీా వాళ్లందరకూ పోయించు హుఁ వాడికి గుండా ? చెరువా ? మనవీధుల్లో కడుగు పెట్టడానికి? . చూస్తాడు ఆనందరావు తడాఖా ఏంటో!...'

'అయ్యా మరి ఆళ్లొస్తే ? '

'అదీ చెప్పాలా వీరన్నా?. .' అన్నాడు రవణయ్య విసుగ్గా

'ఏ పెయ్యమంటారా ?...'

'ఊఁ ' అన్నాడు రవణయ్యే ..

ఆనందరావుకు కాఫీ యిద్దామని, వాకిలి గది దగ్గరకువచ్చి జ్యోతి, మాటలు వినబడుతుంటే, తలుపవతలే నిలబడింది . ఈ మాటలు జ్యోతి చెవుల బడ్డయి ఇన్నాళ్లూ ఈ ఎలక్షను గొడవలు తనేమీ పట్టించుకోగూడదనుకుంది కానీ యీా మాటలు చెవుల బడ్డాక, తామరాకుమీాది నీటిబొట్టులా వుండలేకపోయింది ఇదే జరిగితే తన ప్రాణస్నేహితురాలు రవణ బ్రతుకు ఏంకావాలి !. మొఖాన యింతపెద్ద కుంకుమ బొట్టుతో

బాల కళ్లల్లో మెదిలింది...ఇక ఆపైన ఆలోచించలేక పోయింది .. వెంటనే ఓ చీటీ ముక్క వ్రాసి, తనకు మంచి నమ్మకస్తురాలైన కూరలమ్మిచేత రవణకు పంపింది జ్యోతి

'రవణా ! నువు నాకు అన్యాయం చెయ్యవని తెలుసు.. నీకు అన్యాయంజరిగితే నేను భరించలేను ... ఈ రాత్రి నీ భర్తను కాపాడుకోవలసిన బాధ్యత నీదే .

సదా నీ మేలుకోరే మిత్రురాలు...'

అది చదువుకున్న రవణ కుప్పకూలి కూర్చుంది తను ఎన్నిచెప్పినా ఎంత పోరుపెట్టినా భర్తను ఎన్నికల్లో పోటీచెయ్యకుండా ఆపలేకపోయింది ఇక యీా గండం గడిచేదెట్లా ?

రాత్రి చీకటి పడుతుండగానే వెంకట్రావూ వాళ్లంతా ప్రయాణమవుతున్నారు ప్రచారం చేసుకోడానికి ఎలక్షను అంటే యిల్లు తిరణాలలా వుంటుంది . వచ్చే వాళ్లకు కాఫీలు పెట్టివ్వడం, అన్నాలువండి పెట్టడం . ఊపిరి సలపని పనితో సతమతమవుతున్న రవణ, అప్పుడే చెయ్యికడుక్కొని యివతలకు వచ్చింది భుజాన కండువా వేసుకుని బయలుదేర బోతున్నాడు భర్త, ఎంతచెప్పినా వినకుండా ..పోనీ యిలా తెలిసిందని చీటీచూపిస్తే. జరిగేదేమిటో రవణకు తెలుసు వెంటనే ఓవుపాయం తట్టింది రవణకు .వాళ్లువాకిలి దాటుతుండగానే .. 'అమ్మా! ..' అంటూ అమాంతం విరుచుకు పడిపోయింది, మాటామంతీ లేకుండా.

. వెంకట్రావుకు కాళ్లూ చేతులూ ఆడలేదు నీళ్లుచల్లినా కళ్లు తెరవక పోయేసరికి, గాభరాపడి, ఆ వీధిలోనేవున్న ఆచారి గారికి కబురుచేశాడు వెంకట్రావు . నాడి చూసిన ఆచారిగారికి ఆ జబ్బేమిటో అంతుబట్ట లేదు ఆచారిగారు ఏ సంగతీ చెప్పకపొయ్యేసరికి. తను అక్కడేవుండి నరసింహం గార్ని మరో యిద్దరు ముగ్గుర్నీ వెంటయిచ్చి మేదరవీధికి వెళ్లి మాట్లాడిరమ్మని పంపించాడు వెంకట్రావు .. సగందూరం వచ్చిన నరసింహం . 'ఊరుమాటు మణిగింది . ఈ వేళప్పుడు వెళ్లి పడుకున్న వాళ్లను లేపితే ఏం బాగుంటుంది ? తెల్లారకట్టనే వెళ్దాం 'మని చెప్పి, ఎవరిళ్లకు వాళ్లను పంపించేశాడు

రాత్రి పన్నెండు గంటలదాకా ఎదురు

చూసిన ఆనందరావు మనుషులు విసుగొచ్చి ఎటు వాళ్లటు వెళ్లిపొయ్యారు తూలుతూ . ఆశించిన విధంగా వెంకట్రావు వాళ్ళూ ఎందుకురాలేదో ఎంత ఆలోచించినా అంతు బట్టని ఆనందరావు . 'మన వీధుల్లోకి వాళ్ళురాగా, మనమేనా తక్కువ తిన్నది!..' అని తన వర్గంతోసహా, అన్ని వీధుల్లోకి వెళ్లి స్వయంగా అడగడం మొదలు పెట్టాడు...

ఈ విషయం తెలిసిన వెంకట్రావు ధైర్యం జారిపోయింది తనవాళ్లెవ్వరో, ఎదుటిపక్షం వాళ్లెవరో కూడా తెలియని పరిస్థితి ఏర్పడింది వెంకట్రావు పక్షం వాళ్లకు . ఆ అయోమయ స్థితిలో ఒక్కటే వుపాయం తోచింది వాళ్ళకు

పోలింగ్ రెండురోజులు కూడా లేదు ... ఆ సాయంత్రం రక్షణ పంపిన చీటీని ఒక టికి పదిమాట్లు చదువుకున్న జ్యోతి, పిచ్చి దానిలా తిరిగింది ఏంచెయ్యాలో తోచక . చీకటిపడింది . రవణయ్యా వాళ్లందరూ వెళ్లిపొయ్యారు ... ఆనందరావు భోజనానికి వచ్చాడు ... 'హమ్మయ్య ... ఈ పూటకు ఈయన యింకెక్కడికీ కదలడులే. ' అని కాస్త ధైర్యం వచ్చింది జ్యోతికి ... జ్యోతి భోజనంచేసి తాంబూలం యిద్దామని హాల్లోకి వచ్చేసరికి ఆనందరావు చెప్పులు తొడుక్కుంటున్నాడు..

జ్యోతికి గుండె ఆగిపోయినయి ..

'ఎక్కడికీ ?.. ' అతి హీనస్వరంతో అడిగింది

బయటకు వెళ్తున్న వాళ్లను 'ఎక్కడికీ' అన్నమాట అడగకూడదన్న సంగతి మర్చిపొయ్యావా జ్యోతీ ?. '

'లేదు కానీ యింత రాత్రివేళ...ఒంటరిగా ఎక్కడికా అని ? .'

'రవణయ్య బాబాయివాళ్లను, కొందరి దగ్గరకు వెళ్లమన్నాను .. నేను స్వయంగా వెళ్లి ఓటు అడగాల్సిన యిళ్లు యింకా కొన్నివున్నయి ఎంతసేపు ? ఓ పదినిముషాలు '

'వొద్దు.. ఇప్పుడు మీరు వెళ్లొద్దు ... కావాలంటే .. రేప్పొద్దున వెళ్లొచ్చు ... ఇప్పుడొద్దు...'

'ఏం యిప్పుడెందు కెళ్లగూడదూ?... ఎందుకో చెబితే మానేస్తాను '

జ్యోతికి ఏంచెప్పాలో తోచలేదు . పోనీ ఆచీటీ చూపిస్తే ? అమ్మో!.. మళ్ళీ వీళ్లూ కత్తులూ కరారులతో వెళ్లి వాళ్ల యిళ్లమీద పడరూ! క్షణం ఆలోచించింది . 'నేను మరో శుభవార్త చెప్పాలను కున్నాను యిప్పుడు ' అంది

'శుభవార్తా! .. ఏమిటబ్బా అది ? ... వెంకట్రావు పోటీ విరమించుకుంటా నన్నాడటనా ? లేక నే గెల్చినట్లు కలవచ్చిందా? . ' పక్కనేవున్న కుర్చీలో కూర్చుని జ్యోతి ముఖంలోకి చూస్తూ అడిగాడు ఆనందరావు

'అదేంకాదు ' జ్యోతికి పోయినధైర్యం తిరిగివచ్చింది . ' మీకు మీకు ' అని ఆపైన సిగ్గు ముంచుకు వస్తుంటే తల వంచుకు నిలబడింది

'ఏమిటి మీకు ? ..' ఆనందరావు దగ్గరగా వచ్చి, గడ్డంపుచ్చుకు మొఖం పైకెత్తి



# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

జ్యోతి కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు...

'మీకు బాబుకావాలా? పాపకావాలా?.' అతడి కళ్ళల్లోకి చూడకుండా రెప్పలు వాల్చేస్తూ అడిగింది జ్యోతి..

'జ్యోతి!!. ' సంతోషంతో జ్యోతిని దగ్గరకు తీసుకొని, సిగ్గు బరువుతో వాలి పోతున్న రెప్పలమీద ముద్దు పెట్టుకుంటూ 'మరి యిన్నాళ్ళూ చెప్పరేదేం నాకు?' అని అడిగాడు మృదువుగా జ్యోతిని హృదయానికి హత్తుకుంటూ.

ఆ క్షణంలో తనకూ ఆయనకూ మధ్య భేదమే అనిపించలేదు జ్యోతికి ఆయనా తనూ ఒక్కటే!. విడదియ్యలేని, అవిచ్ఛిన్నమైన యీ అనురాగబంధం ఎప్పటికీ యిలాగే వుండాలి భగవాన్!... అనుకున్న జ్యోతి, భర్త కళ్ళల్లోకి చూస్తూ..

'ఇంతకూ నే నడిగింది చెప్ప నేలేదు!..' అని గుర్తుతెచ్చింది.

'పాప పుడితే. నీలానే ఎన్నికలొద్దు ... పోటీవొద్దు అంటుంది కాబట్టి నాకు బాబేకావాలి ... నా కొడుకు నాపేరు నిలబెట్టాలి. చక్కగా ఏ ఎమ్ పి నో అయి మంత్రికావాలి కనీసం వాడైనా యీ వూరిని భూలోకస్వర్గంలా తయారు చెయ్యాలి..' అంటూనే జ్యోతిని మళ్ళీ ముద్దుపెట్టుకుని, 'వస్తాను ... ఇప్పుడే వస్తాను..' అన్నాడు మళ్ళీ చెప్పులు తొడుక్కుంటూ...

జ్యోతికి ఎవరెస్టు మీదనుండి పాతాళంలోకి పడిపోయినట్లయింది. అక్కడే క్రింద కూలబడి 'మరి ..మరి.. ఇంతమంచి శుభవార్త చెప్పినందుకు... నా కోరిక మన్నించరూ? ...' జాలిగా అడిగింది ..మాటలు నూతిలోనుండి వచ్చినట్లున్నయి.

'జ్యోతీ' ఇంతమంచి శుభవార్త నువుచెబితే నేనూ నీకు, గెలిచానన్న శుభవార్త చెప్పొద్దూ!. కానీ,... ఒక్కటి మాత్రం ప్రామిస్ చేస్తున్నాను.. ఈ ఎన్నిక ఫలితాలు తెలిసి గెలిచానని తెలిసినప్పుడు, పంచాయతీలో మాదే మెజారిటీ వచ్చిందని తెలిశాక, నువ్వు కోరినట్లు, వెంకట్రావు పక్షం వాళ్ళనే సర్పంచ్ ఎన్నుకునేట్టు చేస్తాను... ఒకసారి అతడికి ఛాన్సు యిచ్చి చూస్తాను, ఏ మాత్రం గ్రామాభివృద్ధి సాధిస్తాడో?... ఇప్పుడు మాత్రం తప్పదు. వెళ్ళాలి ఇది ఆనందరావు ప్రిస్టేజి క్వశ్చను .. ఆనందరావు దేన్నైనా భరిస్తాడు కానీ.. సవాలును మాత్రం భరించలేడు వెళ్తున్నా ఇంట్లో జాగ్రత్త...' అంటూనే వెనక్కైనా తిరిగి చూడకుండా వెళ్ళిపోయ్యాడు ఆనందరావు...

'ఏమండీ! ..' ప్రపంచం చీకటి మయమైనట్లు కనిపిస్తుంటే, పెదవులు దాటీ దాటకుండా పిల్చిన ఆ పిలుపు, అక్కడే గాలిలో కలిసిపోయింది, ఆనందరావు వినబడనంత దూరం వెళ్ళిపోయ్యాడు గనుక . .

మరుక్షణం జ్యోతి కర్తవ్యం జ్ఞాపకం వచ్చినట్లు చివ్వున లేచింది.. రంగడు నిద్ర పోతున్నాడు. . నిద్రపోతున్న నరసమ్మగార్ని లేపి, 'యిల్లు చూస్తుండమని' చెప్పి, పరుగులాంటి నడకతో బయలుదేరింది జ్యోతి ..

చీకటి మయంగా వున్న వీధుల్లో నీడ నడుస్తున్నట్లుగా వున్న ఆనందరావును పోల్చుకుని, అతడ్ని చేరుకోవాలని గబగబా నడుస్తుంటే . ఎదురుదెబ్బ తగిలి ముందుకు పడింది మళ్ళీలేచి రెండడుగులు వేసిందో లేదో, మలుపు తిరుగుతున్న ఆనందరావును, ఓపది పదిహేను నీడలు చుట్టుముట్టడం. 'అమ్మా!..' అన్న ఆనందరావు అరుపు, 'కెవ్వు'మని పడిపోయిన జ్యోతి కేక ఒక్కసారే గాల్లో కలిసిపొయ్యాయి...

*   *

వేణు యివ్వాళంతా పరాకుగా వున్నాడు... ఏమిటో పిచ్చి పిచ్చిగా వుంది కాసేపు అలా సముద్రతీరంలో యిసకలో కూర్చుని, ఉషతో కబుర్లు చెబితే మనసు బాగుంటుందేమోనని వచ్చాడు అన్ని వూళ్ళల్లోలాగా విశాఖపట్నంలో సముద్రం వెలివేసినట్లు దూరంగా వుండదు .. ఊళ్ళోకి చొచ్చుకు వస్తున్నట్లు, అందమైన పట్నం అగాధమైన సముద్రం కలిసి కాపురం చేస్తున్నట్లు, ఏమూల నుంచో ఓ మూలనుంచీ సముద్రం కన్పిస్తూ అందంగా వుంటుంది .

ఇవ్వాళ వేణు అందాన్ని ఆస్వాదించే స్థితిలో లేడు ... అంతకంటె ఉష మాటలకు జవాబు చెప్పే 'మూడ్'లోనూ లేడు.. ఇప్పుడతడు ఫైనలియర్. ఎండాకాలం సెలవల్లో గుంటూరు వెళ్ళాలని, సైకిల్ మీద గుంటూరు రోడ్లన్నీ చుట్టి రావాలని, విద్యార్థులతో కలకలలాడుతూ వుండే 'థియసాఫికల్ లాడ్జి' నుండి 'స్వరాజ్య మైదానం' దాకా వున్న రోడ్ల మీద చక్కర్లు కొట్టాలని, అక్కను బావను చూసి రావాలని, సుశీలతో మాట్లాడాలని, యిన్ని అనుకున్న వేణు సెలవులకు గుంటూరు వెళ్ళనే లేదు! చంద్రశేఖరం గారి ఆహ్వానం మీద వాళ్ళ అంట్లో కూతురుతో కలిసి, ఉత్తర హిందూస్థానమంతా చుట్టి వచ్చాడు .అసలు వెళ్ళివుండే వాడే కాదు...ఉష బలవంతానికి తోడు, శంకరం గారు 'దేశాటనం చేస్తే లోకజ్ఞానం



# హార్యా సంధ్యా ప్రవర్తతే..

వస్తుందని', పదే పదే చెప్పింది జ్ఞాపకం రాగా తప్పని సరిగా వెళ్ళాడు వేణు తిరిగి వచ్చేసరికి కాలేజీల తెరిచారు ఓ రెండు రోజులు సెలవు పెట్టయినా వెళ్ళి, అమ్మను, అక్కా బావలన సుశీలను చూచి రావాలన్నంత పిచ్చిగా వుంది వేణుకు

అదే ఆలోచిస్తూ ఉష ఏదో చెబుతుంటే వూరికే 'ఊఁ ' కొడుతున్నాడు వేణు క్షణంలో రూమ్‌మెట్ పరుగెత్తుకుంటూ వచ్చాడు, 'ఒరేయ్! నీకు 'ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం' వచ్చిందిరా' అంటూ

వేణు కవరు చించిచూచాడు ఆదుర్దాగా

'ఆనందరావు ఎక్స్‌పైర్డ్ స్టార్టు యిమ్మీడియెట్లీ '

కాగితం చేతిలోంచి జారిపోయింది

వెత్తిన పిడుగుపడ్డట్టయి రాతిబొమ్మలా అలాగే కూర్చున్నాడు కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుని 'బావా బావా ' అంటున్నాడు అస్పష్టంగా

స్నేహితులు వచ్చి ట్రెయిన్ ఎక్కించారు ఇల్లు చేరుకునేసరికి శోక దేవతలా కూర్చునివున్న అక్కను చూడగానే దుఃఖం పట్టలేక, ఒక్క పరుగున వెళ్ళి అక్కఒడిలో తలపెట్టుకున్నాడు అరగంటకుగానీ తల ఎత్తి అక్క మొఖంలోకి చూడలేకపోయ్యాడు..

జ్యోతి ఏడవటంలేదు పిచ్చిదానిలా ఆనందరావు పటంవైపు కన్నార్పకుండా చూస్తూ కూర్చుంటోంది ఎందరో వస్తున్నారు వెళుతున్నారు ఏదో పలుకరిస్తున్నారు దేనికీ జవాబులేదు ఎన్నిక వాయిదా వేశారని చెప్పారు ఎవరో నిరామయంగా నవ్వి వూరుకుంది

జ్యోతి గత రెండు మూడు రోజులుగా అన్నం నీళ్ళు ముట్టలేదని విన్నాక వేణుకు తన కర్తవ్యం స్ఫురించింది తన్ను తాను నిగ్రహించుకుని, అక్కకు ధైర్యంచెప్పడం మొదలుపెట్టాడు .

'అక్కా ఏమిటక్కా ! బావ అన్యాయం చేసి పోయినట్లు నువ్వూ మాకు అన్యాయం చెయ్యదల్చుకున్నావా ? లే నువ్విలా బేలలా కృంగిపోవడం, ఇలా కృశించిపోవడం, ఆనందరావు భార్యకు శోభించదక్కా బావ ముక్కుకు సూటిగా పొయ్యేవాడు బావకున్న గుండె ధైర్యం ఎవరికుంది! నువ్వు ఆయనకు తగ్గ భార్య వనిపించుకోవాలి అసలు యీ చదువు గొడవ లేకుంటే నేను వచ్చి, యిక్కడ బావస్థానంలో నిలబడి బావ పేరు నిలబెట్టేవాడిని ' జ్యోతి గుండెల దడ దడ లాడాయి 'ఏమిట్రా? ఏమంటున్నావ్?' అంది కంపించే స్వరంతో

'అవునక్కా నువ్విలా ఏడవడానికి వీల్లేదు ఆయన అర్ధాంగివి . బావ ఆశయాలు సాధించేందుకు ప్రయత్నించక్కా .. అసలు నువ్విలా ఏడుస్తూ కూడకొ, నీళ్ళు ముట్టకుండావుంటే స్వర్గంలో బావ ఆత్మ ఎంత క్షోభిస్తున్నదో నువ్విలాగే వున్నావంటే, నేను చదువుమానేసి, నీదగ్గరేవుండిపోతాను 'అని చివరికి బెదిరించాడు కూడా వేణు

రోజులు గడుస్తున్నాయి జ్యోతి తన్ను తాను నిగ్రహించుకుంది వేణు మాటల్లో నిజంలేక పోలేదు తమ దంపతులమధ్య అడ్డుగోడలు వున్నాయనుకుంది యిన్నాళ్ళూ కానీ ఆనందరావు మరణించాక తెలుసుకుంది తమ యిద్దరిమధ్యా ఏ గోడలూ లేవు ఆయనలేందే తను బ్రతకలేదని . అయినా తను బ్రతకాలి తప్పదు తన కడుపులో వూపిరిపోసుకుంటున్న, తన భర్త వంశాంకురం కోసమైనా తను బ్రతకాలి . అనుకుంది

వేణు పదిరోజులున్నాడు అతడికిప్పుడా యింట్లో వుండబుద్ధి పుట్టటంలేదు ఈ పదిరోజులుగా సుశీల అసలు కన్పించక పోవడం, అతడికి చిరాకుగానూ, ఆశ్చర్యంగానూ వుంది ఇంటికి వెళ్ళి చూశాడు . తలుపు తాళం పెట్టివుంది అక్కను యిలాంటప్పుడు అడగడానికి ఆతడికి మనసొప్పలేదు ఓ రోజు రంగడ్ని పిలిచి అడిగాడు 'వాళ్ళ పెద్దికి జబ్బుగా వుంటే గుంటూరు ఆస్పత్రిలో చేర్పించారు, వాళ్ళ అమ్మా నాన్న' అని చెప్పాడు రంగడు .

జరుగవల్సినవన్నీ పూర్తయ్యాక, జానికమ్మగారు కూతుర్ని గుంటూరు తీసుకువెళతానన్నది ఎవ్వరెంత చెప్పినా జ్యోతి గుంటూరు వెళి పుట్టింట వుండడానికి ఒప్పుకోలేదు రంగడి బాధ్యత ఏనాడో తన కప్పగించాడు తన భర్త ఆ యిల్లు తనకు పుట్టిల్లయినా, రంగడికి హక్కులేని ఆ యింట్లో వుండడం క్షేమకరం కాదనుకుంది జ్యోతి వేణు చెప్పినట్లు, తన భర్త సాధించదల్చుకున్న గ్రామాభివృద్ధి తనే ఎందుకు సాధించగూడదు? అనే ఆలోచన గూడా కలిగింది జ్యోతికి

'ఒరేయ్! రంగా! , మీ వదిన గనుక తన ఆరోగ్యాన్ని అశ్రద్ధ చేస్తే వెంటనే నాకు వుత్తరం వ్రాయి . నేను చదువు మానేసి, అక్క దగ్గర వచ్చి కూచుంటాను...' జ్యోతి వినేట్లుగా హెచ్చరించి,



వాల్తేరు బయల్దేరాడు వేణు ..

* * *

పండంటి అక్కా బావ కాపురం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, వేణు పనిగా ఉష దగ్గరికి వెళ్ళి కూర్చుంటున్నాడు ఆ బాధ మర్చి పోడానికి అసలీ మధ్య ఉషను చూడగానే అతడి మనసు పురివిప్పిన నెమలిలా నాట్యమాడుతోంది ఆమె కబుర్లు వింటూ గంటలు నిముషాల్లా గడిపేస్తాడు ఆమె వెళ్ళిపోగానే సుశీల వచ్చి తిష్ఠవేసుకుంటోంది అతడి ఆలోచనల్లో తన పిచ్చి సుశీని మోసం చెయ్యలేడు ఇక ఉషకు దూరంగా వుండడానికి ప్రయత్నించాలి అనుకున్న రోజున, ఉష వచ్చి బీచికి పిల్చుకుపోతోంది ఉషను తప్పించుకోలేడు సుశీలను దూరమూ చేసుకోలేడు ఆలోచనలతో సతమతమవుతున్న వేణును, ఉష వచ్చి పలుకరించింది

'హల్లో! ఏమిటి వేణూ! ఆలోచిస్తున్నారు?' అంటూ

'హల్లో!' అన్నాడు లేని నవ్వు తెచ్చుకుని వేణూ

'ఎందుకంత విచారంగా వున్నారు వేణూ?', ప్రక్కనే కూర్చుంటూ అడిగింది

'విచారమా? అదేం లేదు తల నొప్పిగా వుంటే ఇలా ఈ బీచి వొడ్డున కూర్చుందామని వచ్చాను'

'చదువెలా సాగుతోంది?', ఎన్నడూ లేని మౌనాన్ని భరించలేక సంభాషణ పొడిగించాలని అడిగింది ఉష

వేణుకు సుశీల సంగతి ఉషతో చెబితే బాగుండుననిపించింది రంగడి వుత్తరం కూడా చూపించి తను సుశీలను పెళ్ళి చేసుకోదల్చుకున్నానని చెప్పేస్తే బాగుండునను కున్నాడు కానీ ఎలా చెప్పడమన్నదే సమస్య అయింది

'ఏదో సాగుతోంది అలా అలా. అయినా నాకు పెద్ద ఆశలూ లేవు' అన్నాడు

'ఏం మీరు విదేశాలకువెళ్ళి చదువు కోరా?'

'లేదు ఉషా! మా ఆర్థిక పరిస్థితులు నన్ను అంతఎత్తు ఆలోచనలను పెంచుకో నివ్వటం లేదు అనవసరంగా మా అమ్మగారి మనసు నొప్పించడం నా కిష్టంలేదు'

'పోనీ ఎవరన్నా పంపితే అన్నా వెళతారా?. లేక అసలటువంటి వుద్దేశ్యమే లేదా?' ఉష గుచ్చి గుచ్చి అడిగింది. .

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

వేణు జవాబు చెప్పలేదు... పెద్దగా నిట్టూర్చాడు అంతే...ఆ తర్వాత కాసేపు కూర్చుని ఉష వెళ్ళిపోయింది...వేణు ఒంటరిగా మిగిలాడు ... అతడి ఆలోచనలు మళ్ళీ రంగడు వ్రాసిన వుత్తరం మీదికి మళ్ళాయి...జేబులో వుత్తరం బయటికి తీసి మళ్ళీ చదువుకున్నాడు...

'వేణుబావకు,

రంగడు నమస్కరించి వ్రాయునది... ఇక్కడ అంతా క్షేమం. వదిన ఆరోగ్యం బాగానే వుంది ... సుశీలక్కా వాళ్ళపిన్ని గుంటూరు ఆస్పత్రిలో చచ్చిపోయిందిట ... సుశీలక్కవాళ్ళ అమ్మానాన్నలదగ్గర వుంటోందిట యిప్పుడు...సుశీలక్క విన్నుతప్ప పెళ్ళి చేసుకోనంటోందిట...ఈ మధ్య సుశీలక్కా, వాళ్ళ నాన్నగారూ వచ్చారు యిక్కడికి, ఆయిల్లు ఖాళీచేసి, అమ్మెయ్యడానికి... వదినదగ్గరకువచ్చి ఏడ్చింది సుశీలక్క...వాళ్ళ నాన్నగారు అడిగారని, నీ అడ్రసుకూడా తీసుకువెళ్ళింది ... వాళ్ళ నాన్నగారు నీకు వుత్తరం వ్రాస్తామన్నారుట రెండుమూడు రోజుల్లో...వదిన నన్ను నీకీ వుత్తరంవ్రాయమంది...తప్పులున్న క్షమించవలెను...ఇట్లు ...రంగడు...'

వేణువుత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు ... అధునాతనంగా కన్పించే ఉష, అమాయకంగా కన్పించే సుశీల యిద్దరూ మెదిలారు అతడి మనసులో...అసలు ఉషతో పరిచయం పెంచుకోకుండా వుండాల్సింది... చివరికి సుశీలకైనా ఆశలు కల్పించకుండా వుండాల్సింది...అనుకున్నాడు...కానీ యిప్పుడు ఏమనుకుని ఏం ప్రయోజనం ? ... ఉషను భార్యగా చేసుకోగల్గితే విదేశాలకువెళ్ళి చదువుకోగల అవకాశం లభిస్తుంది ... శంకరం మేష్టారి ఆశీర్వాదం, తనుకన్న కలలు సఫలమయ్యే అవకాశం వుంటుంది...ఎలానూ తనకా స్థోమత లేదు...అదృష్టం ఎప్పుడూ అవకాశం రూపంలోనే వస్తుందిట...ఈ అవకాశం తను వినియోగించుకుంటే ? ... అనే ఆలోచన కూడా వచ్చింది...

కానీ తను సుశీలకు అన్యాయం చెయ్యలేడు!...కల్లా కపటం ఎరుగని సుశీలలో ఆశలు రేకెత్తించి, యిప్పుడు సమూలంగా పెరికి వెయ్యలేడు... ఆ రాత్రి అంతా ఆలోచిస్తూనే వున్నాడు...ఎంత ప్రయత్నించినా సుశీలను కాదనలేక పోతున్నాడు... సుశీలకు యిచ్చిన మాటను తప్పలేక పోతున్నాడు ...

మర్నాడు మధ్యాహ్నం ఆలోచనల్లోనే సతమతమవుతుంటే 'వుత్తరం వచ్చిందంటూ' రాజా ఓ కవరు తెచ్చి ముందు పడేశాడు...ఆ దస్తూరీ చూస్తే యీమధ్య అంత పరిచయమున్నదిగా కన్పించలేదు ... ఆశ్చర్యపోతూ కవరు చించాడు వేణు...

'చి. వేణుగోపాల్‌కు,

దుర్గమ్మ మా మరదలు అవుతుంది... మా సుశీలను ఆవిడకు పెంచుకోడానికి యిచ్చాము..., ఆవిడకు పిల్లలు లేకపోతే ... ఇరవైరోజుల క్రింద మా మరదలు చనిపోయింది...సుశీల యిప్పుడు మా దగ్గరే వుంటున్నది...సుశీల మా కన్ని విషయాలూ చెప్పింది...నువ్వు మాకు అల్లుడు కాబోవడం మా అదృష్టం...సుశీలకు వాళ్ళ పిన్ని ద్వారా సంక్రమించిన ఆస్తి కొంత వుంది... కట్నం కానుకలు నువ్వు కోరిన విధంగా జరిపించగలవాడను. నీ యొక్క వీలునుబట్టి చెబితే మీ అమ్మగారితో సంప్రదించి ముహూర్తం పెట్టించగలవాడను...'

ఇదేమిటి! పరిచయమున్న వాడిలా నువ్వు నువ్వు అంటూ వ్రాస్తాడీయన అనుకొని... మిగతా పంక్తులు చూడకుండా పేజీ త్రిప్పి సంతకం చూశాడు వేణు...'ఇట్లు - వరదరాజులు...' అని కన్పించింది చివర...

వేణు కళ్ళు నులుముకొని చూశాడు... అవే అక్షరాలు!!... ఆ వరదరాజులు కాడేమో...ఆత్రుతగా వెతికాడు అతడి చిరునామా వ్రాశాడేమోనని...ఇంకొంచెం పైగా 'యీ దిగువ చిరునామాకు వ్రాయవలసింది...' అదే అడ్రసు!!...ఇంతే అంతే ఆ వుత్తరమంతా 'వరదరాజులు' మాత్రమే కనిపిస్తోంది వేణుకు... 'వాళ్ళ నాన్నగారిది గుంటూరేట...హైస్కూల్లో మేష్టరుట... పేరు ఏదో తమాషాగా...' అక్కమాటలు వేణు చెవుల్లో గింగురుమన్నాయి...

వరదరాజులు!... రఘుబాబును చంపిన వరదరాజులు!... మేష్టారిని పోలీసుస్టేషనులో నిలబెట్టించిన వరదరాజు!...తనను దొంగగా చిత్రించడానికి ప్రయత్నించిన వరదరాజులు!...

వేణు ముఖం ఎర్రబారింది... ఉత్తరం చింపి ముక్కలు ముక్కలుగా చేశాడు... అగ్గిపెట్టె తీసి వెలిగించాడు... ఆవేశంగా డైరీ తీశాడు...అందులో నిర్మలంగా నవ్వు తోంది సుశీల!... 'కాదు వరదరాజులు కూతురు' అనుకుంటూ ఫోటోతీసి వేల కేసి కొట్టాడు...అల్లుడుట!...అల్లుడు!.. పళ్లు పటపట కొరికాడు...వెంటనే ఓ కాగితం తీసుకు 'వరదరాజులు'కు వుత్తరం వ్రాసి పోస్టులో పడేశాడు... మనసు అల్లకల్లోలంగా వుంది. ఏదో తెలియని అశాంతి...డైనింగ్ హాలుకు కూడా వెళ్ళ కుండా పిచ్చిగా తిరుగుతున్నాడు...ఆ పూట కాలేజికి కూడా వెళ్ళలేదు. సుశీల జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ... 'కాదు వరదరాజులు కూతురు... కడుపున పుట్టిన కూతురు' అనుకున్నాడు కసిగా ... వేణు విసురుగా లేచాడు...ఉషా వాళ్ళ యింటివైపు నడిచాడు...

ఉష యింట్లో వుందో, కాలేజికి వెళ్ళిందో అనుకుంటూ తలుపుతట్టాడు... ఉష తలుపు తెరిచింది...

'ఉషా!... కాలేజికి వెళ్ళలేదా?...'

'ఒంట్లో బావుండక వెళ్ళలేదు... లోప లకురా వేణూ!...' ఆప్యాయంగా ఆహ్వానిం చింది ఉష...

సోఫాలో వాలిపోయిన వేణు పీక్కు పోయిన మొఖం, కళ్ళల్లో పూర్తిగా చల్లా రని అగ్ని జ్వాలలు... మున్నెన్నడూ వేణును యిలా చూడలేదు ఉష...

'ఏమలా వున్నావ్ వేణూ?'

'ఏం లేదు. తల బద్దలు కొట్టుకు పోతోంది...కాస్త చల్లటి పానీయం ఏదన్నా వుంటే...యివ్వు ఉషా...'

ఉష మౌనంగా లేచింది. లోపలికి వెళ్ళి రెఫ్రిజిరేటరులో వున్న యాపిల్, చక్కెర పళ్ళు తీసి, ముక్కలుకోసి ప్లేట్లో పెట్టి, వేణు ముందుంచింది...ఆ తర్వాత కూల్ డ్రింక్ కలిపి తెచ్చి యిచ్చింది... ఆవు రావురుమంటూ తినేశాడు వేణు ... తర్వాత డ్రింక్ తాగి సోఫాలో వాలి పోయ్యాడు. నుదురు చేత్తో రాసు కుంటూ... దగ్గర కూచుని నుదుటి మీద పడిన జుట్టు మునివేళ్ళతో పైకి తోసి మెల్లిగా అమృతాంజనం రుద్దుతోంది ఉష ... మొదట పువ్వులాంటి ఉష చెయ్యి తగలగానే ప్రాణం హాయిగా అనిపించింది వేణుకు...

ఇంతలోనే అంతరాంతరాలలోంచి 'బావా' అని పిల్చినట్లయింది వేణుకు ... వేణు వులిక్కిపడి, నుదుటి మీదనున్న ఉష చేతిని తీసేసి, 'పువ్వులాంటి నీ చెయ్యి తగలగానే తలనొప్పి తగ్గిపోయింది ఉషా ... ఇంక వద్దు...ఏవైనా కబుర్లు చెప్పు వింటాను...' అన్నాడు... (ఇంకా వుంది)




భారతదేశంలో యోగులకున్న గౌరవం భోగులకు లేదు. దీనికి కారణం లేకపోలేదు.

యోగులు సర్వసంగ పరిత్యాగులై, వుండీ కూడా లోకహితాన్ని కోరుతూ ఉంటారు. కోరడమేకాదు. లోకశ్రేయస్కర కార్యాలను చేస్తూ ఉంటారు.

పూర్వం మన మహామునులు అరణ్యాల లోనే నివసిస్తూ, తమ వద్దకు వచ్చే రాజులకు తగిన సలహాల నిచ్చేవారు. రాజ్య పరిపాలనా పద్ధతిని వివిధ సూత్రాల రూపం గానూ, స్మృతుల రూపంగానూ తయారు చేసి ప్రభువులకు అందించేవారు!

కాలంతోపాటు సంఘంలో కూడా మార్పు కలుగుతూ వచ్చింది. క్రమేపీ సన్న్యాసులు వనాలలో ఉండకపోయినా, గ్రామాలకూ, నగరాలకు కాస్త దూరంగా ఆశ్రమాలు నిర్మించుకుని అక్కడనే నివ సిస్తూ, భిక్షాటనవల్ల ప్రాణధారణ చేసు కుంటూ సదుపదేశాల మూలంగా జనాన్ని ప్రబోధిస్తూ వచ్చారు. గృహస్థుల యిండ్లలో మాత్రం ప్రవేశించేవారు కారు.

క్రమేపీ సన్న్యాసులు గృహస్థ శిష్యుల నిర్బంధ ప్రార్థనలపైని వారి గృహాలకు వచ్చి కొలది కాలం వుండి, తమ గృహం పావనమైనదని, ఆ శిష్యులు భావించేక వెంటనే ఆశ్రమానికి వెళ్లడం జరిగేది. అన్ని స్థితులలోనూ నిర్లిప్తతయే యోగుల స్వభావం! లోకాను గ్రహం, శిష్యులను తరింప జేయడం వారి ప్రధాన లక్ష్యం.

వివేకానందస్వామి ఆధునిక పద్ధతుల్లో విద్యాభ్యాసం చేసినా, ఆధ్యాత్మిక చింతలో ప్రాచీనులైన మహనీయులకు ఏ మాత్రము తీసిపోక ఆదర్శ సన్న్యాసిగా పేరుపొందాడు. తాను ముక్తిమార్గాన్ని అన్వేషించడమే కాకుండా — యితరులనున్నూ ఆ మార్గాన నడిపించాడు. మహామునులు లోకోపకారార్థం స్మృతులనూ, సూత్రాలనూ రచించి, పాల కులకు హితోపదేశం చేసిన మాదిరిగా — ప్రపంచం అంతటా ప్రధాన కేంద్రాలలో రామకృష్ణమఠాలను స్థాపించి ఆధ్యాత్మ విద్యా ప్రబోధాన్ని చేశాడు. దరిద్రులకు అనేక ఆధారాలు కల్పించి జీవయాత్రకు లోపంలేకుండా చేసి, ఆ మీదనే వారి బుద్ధి తత్త్వచింతన పైకి మళ్లేటట్లు చేశాడు.

ఆయన ఆదర్శ జీవనానికి క్రింది సంఘ టన అపూర్వమైన తార్కాణ!

వివేకానందుడు దేశంలో మత ప్రచారం చేస్తూ దక్షిణదేశానికి వచ్చాడు. ఆయన ఏకాకి. కాషాయ వస్త్రధారి. ఆయన పేరు చాలా మందికి తెలియదు కూడా. ఒకనాటి ఉదయానికి ఆయన చెన్నపురిలో కోట ప్రాంతానికి ఆయన చేరుకున్నారు. ప్రశాంత పరిస్థితి! బంగాళాఖాతం సమున్నత తరంగ హస్తాలతో తన స్వాభావికశోభను తిలకించు టకై దగ్గరకు రమ్మని ఆహ్వానిస్తున్నట్లు ఆయనకు తోచింది. తదేక దృష్టితో సాగరంవైపే చూస్తూ ఆయన రెండు గంటలు గడిపారు. తర్వాత సముద్రతీరాన్నే నడుస్తూ, పదకొండు గంటల ప్రాంతానికి తిరువల్లిక్కేణిలోని 'ఐస్‌హౌసు' దగ్గరికి వచ్చి అక్కడి బంగళా చుట్టూ ఉన్న ప్రహరీ గోడమీద కూర్చుని, సముద్రం వైపే చూస్తూ, ఏదో ఆనందిస్తూ కొన్ని గంటలు గడపారు. పదకొండు గంటలకు అక్కడ చేరిన వ్యక్తి మండు యెండలో రెండు గంటలదాకా నిశ్చలంగా కూర్చుని ఉండడం బంగాళాలో ఉన్న స్త్రీలకు ఆశ్చర్యం కలిగించినది. వారు విద్యావతులు! ఆంగ్లం బాగా వచ్చు. బంగళాలోకి రావా లనీ, అథమం వరండాలోనయినా కూర్చో వాలనీ, ఆహార పానీయాలు స్వీకరించాలనీ కోరగా స్వామి అడిగిన ప్రశ్న—

'గృహ యజమాని యింట్లో వున్నారా?' అని.

'లేరు. కోర్టుకు వెళ్లారు, నాలుగు గంటలకు హైకోర్టు మూశాక — నాలుగు న్నరకల్లా వస్తారు.'

'సరే! యజమాని వచ్చాకనే — ఆయన ఆహ్వానంపైని లోపలికి రాగలను. అంత వరకూ యిక్కడే కూర్చుంటాను.' గృహ యజమాని లేని యింట్లో ప్రవేశించ కూడదు. అందులోనూ సన్న్యాసులు ఆ వైపే చూడకూడదు. నేను సముద్రాన్నే చూస్తూ, భగవద్విలాసాలను పర్యాలోచిస్తూ కూర్చున్నాను'

గృహ యజమాని వచ్చి ఆహ్వానించే వరకూ స్వామి ఆ గోడమీద నుంచి కదలలేదు.

వివేకానందస్వామి జీవితం యోగులకూ, సన్న్యాసులకే కాదు, అందరికీన్నీ ఆదర్శమై ఉన్నది. ●



# గోడమీది రాతలు - ఆడవారి అయిష్టత

మరుగుదొడ్లలో గోడలమీద రకరకాలైన రాతల్ని మనం చూస్తుంటాం. వాటిల్లో చాలాభాగం సెక్స్‌కి సంబంధించే ఉంటాయి. యిటీవల జరిగిన పరిశోధనల్లో స్త్రీలకన్నా ఎక్కువగా పురుషులే తమ ఊహాపటిమను ఈ విషయంలో ప్రదర్శిస్తారన్నది వెల్లడయింది.

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రజ్ఞులిద్దరు తమ సర్వేలో యిలాంటి గోడలమీది రాతలు సాధారణంగా ఈ గదుల గోడలపైనే కన్పిస్తాయని, రచయిత ఏకాంతంగా తన మనోభావాన్ని ఈ విధంగా వెల్లడిచేస్తాడని వారు తెలుసుకున్నారు. ఎలివేటర్‌లు, మెట్లదారుల గోడలుకూడా ఈ రకానికి చెందిన రాతలకు ప్రసిద్ధి చెందినవే.

లాస్ ఏంజల్స్‌లో, హాలీవుడ్‌లో ఈ గోడల మీది రాతలని సేకరించడానికి డాక్టర్ హార్వే డి. లోమాన్స్, డాక్టర్ జెర్షన్ వెట్‌మన్‌లు కెమేరాలు, నోట్‌పాడ్‌లు పట్టుకొనిబయల్దేరారు.

వాళ్లకు అన్ని చోట్లా ఈ రాతలు కన్పించాయి.

బహిరంగప్రదేశాల్లో ఎక్కువగా బ్రిడ్జిల మీద, రహదారులపైనుంచి వెళ్లే కాలిబాటలమీదా, స్కూల్స్‌కి వెళ్లే దారుల్లో, బెంచీలమీదా, ఆటస్థలాల్లో, పార్కింగ్ ప్రదేశాల్లో, సొరంగమార్గాలలో ఈ గోడల మీది రాతలు వారికి కన్పించాయి.

ఇక ఇళ్లల్లో ముఖ్యంగా మరుగుదొడ్లలో కనిపించింది.

ఆడవారు మాత్రం వాడే గదుల్లో మాత్రం అవి చాలా అరుదుగా, ఊహించనిదిగా ఉందని వారన్నారు.

ఈ గదుల్లో రాసే సందేశాలు చాలా పెద్దవిగా సెక్స్‌కి సంబంధించిన అవయవాల, చర్యల బొమ్మలతో సహా ఉన్న పెద్ద పెద్ద వ్యాసాలు, పద్యాలు, సామెతలు జోక్స్‌తో నిండి ఉంటాయి.

సాధారణంగా ఈ గదుల్లో రాతలు సెక్స్‌కి సంబంధించినవిగానే ఉంటాయి. ఒక్కొక్కప్పుడు అవి రాజకీయ, సాంఘిక విషయాల గురించినవి కూడా ఉండటం కద్దు.

చివరికి డాక్టర్ లోమాన్స్, డాక్టర్ వెట్‌మన్‌లు ఈ స్నానాల గదుల్లో గోడలమీది రాతలు హోమో సెక్సువాలిటీకి సంబంధించినవని తేల్చారు.

'మరుగుగది గోడమీది రాతలు ఎవరో తెలియని వ్యక్తి రాసినవయినా, హోమో సెక్సువాలిటీకి సంబంధించినవిగా ఉన్నా అవి నలుగురూ కలిసి చూడడానికి నిర్దేశించబడినవి కాదు' అన్నారు.

'ఆ విధంగా మరుగుగది గోడమీదిరాతలు ఈ రకం సెక్స్‌కి సంబంధించినవని అర్థం అవుతుంది.'

ఈ రాసేవారి తర్వాతివారైన చదివే వారికి ఒక అభియం ఈ రాతల్లో కనిపిస్తుంది.

'ఈ రకం సెక్స్‌కి సంబంధించిన ఊహాలు తమకేకాకుండా అలాంటివారుయింకా కొందరు ఉన్నారన్న ఊరట చదివేవారిలో కలుగుతుంది' అని ఆ పరిశోధకులు గుర్తించారు.

అది ఊరట కలిగిస్తుందనటం నిజమే. అలాంటి అసభ్యకరమైన ఊహాలున్నవారు మరికొందరున్నారని తెలుసుకోడం ఊరట కలిగిస్తుందనటం వాస్తవమే.

కానీ బహిరంగ ప్రదేశాల్లో గోడమీది రాతలు మరోవిధంగా ఉంటాయి. అవి పెద్ద పెద్దవిగా రంగురంగులలో (పెయింట్ చేయబడి) ఉంటాయి.

ఇలాంటిచోట గోడమీది రాతలు వేరే విధంగా ఉంటాయి. దొంగల గుర్తులు, మాటలు, వ్యక్తికి సంబంధించిన, ముఠాకి చెందిన గుర్తులు, స్నేహసంబంధమయిన, వినోదుల నుద్దేశించి రాసిన సందేశాలు కనిపిస్తాయి.

సాధారణంగా గోడమీది రాతలు ప్రేక్షకుల ఆదరణనిబట్టి ఉంటాయి. నలుగురూ చూసే ప్రదేశాల్లోనే యిలాంటివి ఉంటూ ఉంటాయి.

— ఎస్ హోనిగ్ (ఇన్‌ఫో)

# డాక్టర్ కబుర్లు

## లెక్కలు

కొత్త మందులని గురించి రాసేటప్పుడు అవి ఎందరికి గుణం ఇచ్చాయో వివరించే లెక్కలు కూడా ఇస్తూ ఉంటారు. నలుగురిలో ముగ్గురు ఒక మందుని సిఫారసు చేశారంటే అర్థం ఏమిటి?

ప్రకటనలలో ఇటువంటి లెక్కలు ఇస్తూ ఉంటారు. ప్రకటనదారుడు నలుగురు డాక్టర్లని కలుసుకుని ఈ లెక్కలని ఇచ్చి ఉండవచ్చు! పరిశోధనకీ దీనికీ చాలా తేడా ఉంది!!

ప్రకటనలలో లెక్కలని చూసి మోసపోరాదు. అనుమానం వస్తే మీ వైద్యుడిని అడిగి చూడండి.

నేనువకసారి వివిధ విమానం తయారీ కంపెనీవాళ్లకి రాశాను. ఏ 'ఆసనం'తో కార్మికుల వీపునొప్పులు అధికం అవుతాయని అడిగాను. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా రాశారు.

నాకు ఇష్టం వచ్చిన సమాధానాలని తీసుకుని 'లెక్కలు' తయారు చేసి ఉండవచ్చుకదా నేను? ఒక్కొక్కరూ కొన్ని వందల కార్మికులని అడిగి వారి జవాబులని ఆధారం చేసుకుని కొన్ని నిర్ణయాలకి వచ్చారు. కాని, ఏ ఒక్కరి




నిర్ణయమూ సరి అయినది కాదు. ఇదీ 'లెక్కల' పరిస్థితి.

హెచ్. ఎల్. హెర్షన్‌సొన్

(కాపీరయిటు)




**సి. హెచ్. ఎస్, పెదపాలెం**

**ఇంటిలోని గోప్య విషయములను బైట వెల్లడిచేసే స్త్రీని ఏంచేయాలి?**

ఉప్పు పాతర వేసేయాలి అని చెప్తే బహుశా మీకు నచ్చుతుంది. కాని ఇంట్లో విషయాలను ఒక్క స్త్రీలే బైటికి చాటుతారన్నది గుడ్డి నమ్మకం. వాచాలతకి స్త్రీలను మించిన పురుషులున్నారు. ఇంట్లో తన మాటను చెవిని పెట్టి వినే సహృదయం లోపించినప్పుడే స్త్రీ బయటికి పోక్కుతుంది. మొగుడు కొట్టినందుకు కాదు, ఆడబడుచు దెప్పినందుకు ఎక్కువగా కుమిలిపోతుంది ఆడది. అటువంటి స్త్రీ కారణం లేకుండా గోప్యం విషయాలు చాటుతుందని అనుకోకు.

**కె. జె, గుంతకల్లు**

**స్నేహితులను విడదీసేవారిని ఏమనాలి?**

ఎవరో చెప్తే విడిపోయేవాళ్ళు స్నేహితులెలా అవుతారు?

**డి. ఎమ్. ఎస్, విజయనగరం**

**ఉక్కుఫ్యాక్టరీ వచ్చేవరకూ విద్యార్థులం సుమారు వందమంది వివాహం చేసుకోకుండా ఉండాలని నిర్ణయించాము...**

కుటుంబ నియంత్రణా కార్యక్రమం జయప్రదం కావడానికిది బాగానే ఉందని కేంద్ర ప్రభుత్వానికి తోచవచ్చు. జాగ్రత్త. అప్పుడు ఉక్కు ఫ్యాక్టరీ వెనక్కి వెనక్కి పడువవచ్చు!

**ఎ.వి.డి.వి., ఎ.బి.ఆర్, బాపట్ల**

**మనస్సు అతిమృదువైనది, అంతమైనది...**

ఎవరు చెప్పారు? మనస్సు కావలిస్తే వజ్రకఠినం కాగలదు! మనిషినిపట్టి దాని అందం కూడా మారుతూ ఉంటుంది.

**సి. హెచ్. బి, అల్లూరుపేట**

**నేనొక కథ వ్రాశాను. అది పత్రికకు ఎలా పంపించాలో తెలియదు. స్టాంపులెలా అతికించాలో తెలియదు.**

ఈ కార్డు ఎలా వ్రాశారో నాకు తెలియలేదు! కవరులో కథ పెట్టి, కవరు మీద చిరునామా వ్రాసి, బరువుకు తగిన స్టాంపులు అంటించండి. పోస్టు బాక్సులో పడేయండి. పోస్టలు వారి దయ మీద ఆధారపడి అతి త్వరగానో, అత్యాలస్యంగానో పత్రికవారికి మీ కథ అంది తీరుతుంది!

**ఎమ్. ఆర్. హెచ్, కొల్లాపురం**

**ఎప్పుడూ పూజలు చేసేవారికే జబ్బులు వస్తుంటాయి ఎందుచేత?**

ఓర్పుగల వారికే కష్టాలు రావడం: భక్తులకే పరీక్షలు ఎక్కువ కావడం దైవలీలలు సోదరీ.

**పి. వి. ఎ. ఆర్, యనమలకుదురు**

**ఆశించిన పుష్పం చేతికందే దాకా తీయని కలలు కంటారు. అందిన తరవాత మకరందాన్ని ఆస్వాదించి అవతల పారేస్తారు. ఆ వాడిన పూవు బ్రతుకేమౌతుంది?**

మీ ప్రశ్నలోని చమత్కారం తీసేస్తే — వాడిన పూవుని పారవేయక ఏం చేస్తారు? ఒరుగులు చేస్తారా ఏం?

**డి. ఎమ్. ఆర్, హైదరాబాదు**

**మానవునికి సుఖం తృప్తి ఎందులో ఉన్నాయి? ఎలా కల్గుతాయి?**

ధర్మబద్ధమైన జీవితం గడుపుతున్న మానవునికి తనకు లభ్యమైన జీవితంలోనే సుఖం సంతృప్తి కల్గుతాయి.

**ఎ. సిహెచ్. పి. ఆర్, ఉనికిలి**

**ఈ ప్రపంచంలో ఉన్న డబ్బు, వస్తువులు అశాశ్వతం అనీ, జీవితం క్షణ భంగురం అనీ తెలిసీ అన్యాయంగా అక్రమంగా డబ్బు సంపాదించడంలో ఆంతర్యం ఏమిటి?**

ఆ క్షణభంగురం అయిన జీవిత కాలంలోనే కావాలనుకున్నవన్నీ సమకూరుస్తుంది డబ్బు. అందుకే ఏదో విధాన దానిని సంపాదించాలని తాపత్రయ పడతాడు మానవుడు.

**పి. కె. ఆర్, ఒంగోలు**

**స్వార్థం అన్నది సామాన్యంగా రక్తమాంసములున్న ప్రతి జీవిలోనూ ఉండును కదా, మరి దానిలోని హెచ్చుతగ్గులే వారికి ఉన్నత ప్రమాణాలకు విశాలభావములకు తార్కాణలు కాదా?**

అంటే తక్కువ స్వార్థపరుడు ఎక్కువ స్వార్థపరుడికంటె మంచివాడు అనా మీ ఉద్దేశ్యం? స్వపర భేదాలు లేక మంచి చేసేవాడూ, తలపెట్టేవాడూ ఉదాత్తుడు స్వపర భేదాలు పాటించి స్వంతా

## వార్తలలో వనిత

మాజీ మెడికల్ విద్యార్థిని, ప్రపంచ సుందరి కుమారి రీటా ఫరియా ఇటీవల లండన్‌లో తన భవిష్యత్తు కార్యక్రమాలని గురించి చెప్పింది. చదువు



పూర్తిచేసి సంఘ సేవ చేద్దామనుకున్న ఉద్దేశం ఎప్పుడో మారిపోయింది; శ్రీ అబ్‌బార్న్‌తో వివాహానికి సంసిద్ధమయిన ఉద్దేశం కూడా మారిపోయినట్లు కనిపిస్తుంది. ఆ మధ్య మరొక భారతీయుడిని — లండన్‌లో — పెళ్ళి చేసుకోవచ్చునన్న పుకార్లు పుట్టాయి. ఇంకోసారి ఎవరో విదేశీయుడు అన్నారు. చివరికి ఆమె ‘ఫాషన్’ వ్యాపారంలోకి దిగుతున్నట్లు ప్రకటించింది. అందమయిన అమ్మాయి రీటా ఫరియా పురుషుల ఫాషన్‌లకి సంబంధించిన వ్యాపారంలో పెట్టుబడి పెడుతుందిట. కాని, ఆడవారి సంగతి మరిచిపోలేదు. భారతీయ ధోరణులు, ప్రభావం కల ఫాషన్‌లు — ఆడవారి కోసం — పాశ్చాత్య దేశాలలో ప్రవేశపెట్టబోతుందిట.

— తమ్మక్క

# నొప్పియా?
## 2 అనాసిన్ చప్పున తగ్గిస్తుంది



ఒడలునొప్పి ఒంటరిగా రాదు. దానితో పాటు బిగువు, ఉదాసీనత, అలసట, కలుగుతాయి. ఇవి నొప్పిని ఎక్కువ చేస్తాయి. అప్పుడు మీకెంతో అసౌఖ్యంగా ఉంటుంది. 2 అనాసిన్ వెంటనే తీసుకోండి. అవి నాలుగు విధాలుగ, ఎంత వేగంగా పనిచేస్తాయో చూడండి :

1. అనాసిన్ నొప్పిని తగ్గిస్తుంది—చప్పున
2. అనాసిన్ అలసటను తీసివేస్తుంది—చప్పున
3. అనాసిన్ ఉదాసీనతను పారదోలుతుంది—చప్పున
4. అనాసిన్ నరాల బిగువును సడలిస్తుంది—చప్పున

ఇందుకు కారణం, డాక్టరిచ్చిన ప్రిస్క్రిప్షనువలె అనాసిన్‌లో ఔషధాలు కలిసి ఉన్నాయి. భారతదేశంలో ఇతర బాధోపశమనకారులకన్నా అనాసిన్‌నే ప్రజలు ఎక్కువ వాడుతున్నారంటే, అందులో ఆశ్చర్యపడవలసిందేమీలేదు.

ఈ సారి ఒడలు నొప్పిగ ఉంటే, అనాసిన్ తీసుకోండి. అనాసిన్ తలనొప్పి, జలుబులు, ఫ్లూ, పంటినొప్పులనుండి నివారణనిస్తుంది. అనాసిన్ దగ్గర ఉంచుకోండి. అనాసిన్ కావాలని పట్టుపట్టండి.

# అనాసిన్

**చాలా మంచిది ఎందుకంటే**
**అది 4 విధాలుగ పనిచేస్తుంది**




Regd. user: Geoffrey Manners & Co. Ltd.

# ప్రశ్నావళి

నీకే మంచి తలపెట్టేవాడు (ఆ స్వార్థం ఎక్కువ అయినా, తక్కువ అయినా) స్వార్థపరుడే అవుతాడు.

**వి. కె. ఆర్, హైదరాబాదు**

'కష్టేఫలి' కష్టించి పనిచేయు కృషీవలునకు తగిన ఫలితం లేదు ఎందుచేత?

కష్టపడ్డం వరకే మానవవంతు. ఫలితం దైవాధీనం. ఇది ఈ యుగ లక్షణం

**కె. కె, విజయనగరం**

ఎక్కడికేనా వెళ్ళి చదువుకుందామంటే వీధిలోవాళ్ళు చాలా చెడ్డగా పేర్లు పెట్టుతారని భయం. నా చదువెలా సాగుతుంది?

వీధిలోని వారికి చేసుపని ఉండదా ఏమి? మరీ అంత పిరికితనం కూడదు. భయం మనని తిరోగమింప చేస్తుందే గాని ఎన్నటికి ముందంజ వేయనీయదు కుమారీ.

**జి. బి. ఆర్, బాబూనగర్**

మనిషి తోటిమనిషి బాగా ఉంటే ఓర్వలేడు. కారణం?

మనిషి కనుక!

**బి. పి. కె, ఆలూరు**

స్త్రీలు పవిత్ర భారతమాత బిడ్డలంటారే...అదంతో...

అక్కడికి పురుషులు కానట్టు!

**ఎస్. ఎస్. జి, నిజామాబాద్**

మనదేశంలో రోజురోజుకి లంచాలు ఎక్కువ అవుతున్నాయి. కారణం?

పని త్వరగా జరగడానికి అదొక్కటే మార్గంగా ఉండడమే కారణం.

**యు. ఎస్. ఎమ్, కొత్తపేట**

మానవులు సుఖంగా ఉంటే సంతోషపడి, బాధగా ఉంటే బాధపడతారు. కారణం ఏమిటి?

సుఖంగా ఉన్నప్పుడు కూడా బాధపడమంటారేమిటి కర్మ!

**పి. ఎస్. ఎల్, కె. సి. వర్కూరు**

సిగరెట్లు కాల్చేవారిని చూస్తే నాకొక విధమైన ఏహ్యభావం కల్గుతుంది ఎందువలన?

తాము చేయలేని పనిని, చేయని పనిని ఇతరులు చేయగల్గినప్పుడు, చేస్తున్నప్పుడు అలాగే ఉంటుంది లక్ష్మిగారూ.

# ఛత్రపతి కానుకలు

అది కరువుకాలం. మహారాష్ట్ర దేశంలోని ప్రతి గ్రామం ఆకలిబాధతో కృశించి పోతోంది. అటువంటి సమయంలో రాజుగారు ఒక పేదవానికి అడక్కుండా నగలు, పట్టు వస్త్రాలు, నాణాలు ఇస్తే ఎలా ఉంటుంది? కుగ్రామంలో ఉండే ఆ మనిషి కుటుంబంలోనివారు ఎంత సంతోషిస్తారు!

బహుమతులు పంపిన రాజుగారు ఛత్రపతి శివాజీ. పేదవ్యక్తి పేరు తుకారామ్, దెహు గ్రామంలో అంగడి పెట్టుకున్నవాడు. కొంత కాలంగా అందరి హేళనకీ గురిఅయిన మనిషి. 'దేవుడి పిచ్చోడు' అని వెక్కిరించేవారు.

ఇటువంటి పిచ్చివాడు ఇంటిబయట రాజుగారి గుర్రాలు నుంచుని వుంటే మాత్రం ఏమి గమనిస్తాడు? అందుకని అతనిభార్యే గుర్రాలమీద వచ్చినవారికి స్వాగతంచెప్పి వారి కానుకలు తీసుకుని భద్రంగా లోపల దాచింది.

కొంతసేపటికి తుకారామ్ ఈ ప్రపంచంలోకి వచ్చాడు. ఇంట్లో సందడిని గమనించి సంగతి ఏమిటని అడిగాడు. శివాజీ భటులకి జరిగిన మర్యాదగురించి విని సంతోషించాడు. కాని, కానుకల సంగతివిని కలవర పడ్డాడు, శివాజీ తనని రాజధానికి పిలిచాడని వినికూడా సంతోషించలేదు. అంతేకాక, రాజుగారు పంపిన కానుకలన్నిటినీ తిప్పి పంపమని భార్య జిజాంబాతో చెప్పాడు! తనకి చెప్పకుండా అపరిచితుల వద్దనుంచి కానుకలు పుచ్చుకోవటం తప్పుఅన్నాడు. రాజభటులు ఒక ఊరిలోనే ఉండటంచేత వారిని పిలిపించి తను కానుకలు పుచ్చుకోలేనందుకు, శివాజీ మహారాజుగారిని కలుసుకోలేక పోతున్నందుకు చింతిస్తున్నానని చెప్పాడు. తను విఠోబా భక్తుడు, ప్రతిక్షణం విఠోబా స్మరణలోనే మునిగిఉంటాడు, సంపదలతో తనకి నిమిత్తం లేదు, వాటిని స్వీకరించటం పాపం అన్నాడు.

తుకారామ్ 1608 లో జన్మించాడు. వారివంశం తరతరాలుగా పండరీపుర విఠల్ స్వామి భక్తుల వంశం. తుకారామ్ తండ్రి బల్హోబా. కొడుకు పదమూడవఏట ధాన్య వ్యాపారం బాధ్యతని అతనిమీద మోపి వెళ్లిపోయాడు. తుకారామ్ ది జాలిగుండె. 1629 లో వచ్చిన కరువులో ప్రజల బాధలు చూశాడు. మామూలు జీవితంమీద విరక్తి పుట్టింది. వ్యాపారాన్ని తమ్ముడు కన్హోబాకి వప్పచెప్పి తను భక్తిలో మునిగిపోయాడు. అతనికి సరస్వతీదేవికలలో ప్రత్యక్షం అయి నామదేవుడు అసంపూర్ణంగా వదిలివెళ్లిన పని పూర్తిచెయ్యమని చెప్పింది. తుకారామ్ ఆమె ఆజ్ఞని శిరసా వహించాడు. 'అభంగ్' అనే పేరుకల పద్యాలు కట్టటం మొదలుపెట్టాడు. భక్తి సిద్ధాంతపు లోతులని ఈ కృతులలో చక్కగా చూడవచ్చు. కర్మకాండకన్నా మనోశుద్ధి ముఖ్యం అన్నాడు తుకారామ్.

—'కరుణ, క్షమ, శాంతి ఎక్కడ ఉంటాయో అక్కడే దేవుడు ఉంటాడు. అక్కడికే వెళ్లి నివాసం ఏర్పరచుకుంటాడు. ఈ గుణాలు ఉన్నచోట ఉండిపోతాడు.'

మెకిన్‌కాన్ అనే పాశ్చాత్య పండితుడు తుకారామ్‌ని 'ది రాబర్ట్ బర్న్స్ ఆఫ్ ఇండియా,' అన్నాడు.

ఈ నాడు రెండుకోట్ల మహారాష్ట్ర రయితులు తుకారామ్ పాటలు పాడుకుంటూ మనశ్శాంతి కల్పించుకుంటున్నారు — పగలు పొలాల్లో పనిచేసుకునేటప్పుడు, రాత్రి గుడ్డిదీపం పక్కనే విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు...

—ఎస్.

## పద్యపాదాలతో విందు భోజనం!

ఇంగ్లండుకు షేక్స్‌పియర్ ఎలాగో, పోర్చుగీసులో 'కెమోయెన్స్' అలాగ. ఆయన 16 వ శతాబ్దంలోని వ్యక్తి. అతను రాసిన గ్రంథం 'లూసియేడ్స్' ప్రపంచ ఖ్యాతిగాంచిన రచనల్లో ఒకటి. అంత గొప్పవ్యక్తి అయివుండీ కూడా ఆయన జీవితమంతా దరిద్రంలోనే గడిపాడు. పరిసరాలలో తులతూగుతున్న మిత్రులు కొందరు ఒకసారి ఆయనను ఒకవిందుకు ఆహ్వానించారు. అక్కడ, వారు 'మేము ఇన్నిసార్లు విందులకు ఆహ్వానించాం కదా! నువ్వు ఒక్కసారయినా భోజనానికి పిలిచావా?' అని అడిగారు. కెమోయెన్స్ దరిద్ర స్థితిని వేళాకోళం చేయడంకోసమే అలా అన్నారు.

"ఒక్క భోజనమేం ఖర్మ! అంతకంటె ఎక్కువయిన విందునే ఇస్తాను రమ్మ"ని వారిని ఆహ్వానించాడు.

ఏం జరుగుతుందో చూడాలని అందరూ ఆయన ఇంటికి వెళ్లారు. భోజనంచేసే బల్లమీద ప్లేట్లు బోర్లించి వున్నాయి. చుట్టూ ఫోర్కులు, చెంచాలు, కత్తులు అందంగా అమర్చి వున్నాయి. ఆహ్వానితులు తమ తమ స్థానాల్లో కూర్చుని ప్లేట్లను తిరగ ద్రిప్పిచూశారు. ఒక్కొక్క ప్లేటుకు ఒకో కాగితం అతుక్కొని వుంది. ఆ కాగితం మీద హాస్యంతో నింపిన పద్యపాదాలు ఒక్కొక్కర్నీ పేరుపేరునా వ్యక్తీకరించి ఉన్నాయి. అతిథులు ఎంతో ఆనందించారు. అటువంటి విందును తాము ఎన్నడూ పొందని కారణంగా కెమోయెన్సును ఎన్నోవిధాలుగా అభినందించారు!

—వినూ.




'ఏం జరిగినా...' అంటూ, చూడామణి వెళ్ళేసరికి చంద్రలావు చిదంబరంతో యేదో చెబుతున్నాడు.

'ఏం జరిగినా, కొంతమందికి మంచిపేరే వస్తుంది. నెహ్రూగారి విషయమే అలో చిద్దాం. కొన్నేళ్ళ క్రిందట బెంగాల్ బీహార్ ముఖ్యమంత్రులు తమ రాష్ట్రాల పరిహద్దుల్ని గురించిన తగాయిదాను పరిష్కరించుకోవ డానికి కల్సుకొన్నారు. వాళ్ళిద్దరూ ఒక నిర్ణయానికి రాలేకపోవడంవలన మొత్తం రెండు రాష్ట్రాలను కలిపివేస్తే మంచిదని ఒక ప్రకటనను చేశారు.

ఆ సందర్భంలో రామ్‌మనోహర్ లోహియా ఒక ప్రకటన చేశాడు. 'బెంగాల్ని, బీహార్ని కలిపివేస్తే నెహ్రూగారికి అశోకుడి తరువాత దేశాన్ని ఏకంచేసిన ఖ్యాతిలభిస్తుంది. ఏదో ఒక కారణంవలన రెండురాష్ట్రాలను వేరువేరుగా ఉంచివేస్తే ఒక సామాన్యుడిమాట నిమిత్తం భార్యను విడిచిపెట్టిన శ్రీరామచంద్రుడి తరువాత అంతటి ఖ్యాతి నెహ్రూగారికి లభిస్తుంది. అందుచేత యేది యేం జరిగినా నెహ్రూగారి కీర్తికి లోపం ఉండదు.'

'చైనా మనదేశంమీద దండయాత్ర జరిపినప్పుడు మన సైనికులకు తగిన యుద్ధసామగ్రి లేకపోవడంవలన మనం కొంత భూభాగాన్ని కోల్పోయేం. ఇంతటి ముఖ్యమైన విషయంలో కూడా కేవలం అప్పటి రక్షణమంత్రి కృష్ణ మీనన్‌ది మాత్రమే తప్పు అయినట్టు మిగిలిన వారందరూ తమ విధుల్ని సక్రమంగా నిర్వహించినట్లుగాను ఊహించుకొని అతన్ని మాత్రం రక్షణ మంత్రిత్వాన్నుంచి తొలగించారు!

'మన రాజ్యాంగంలో 75 వ అర్టికలు ప్రకారం యే నిర్ణయానికైనా మొత్తం మంత్రివర్గం బాధ్యతను వహించవలసి ఉంది కాని దాన్నిగురించి యెవరైనా పట్టించు కొన్నారా? గోల్డు కంట్రోలు విషయంలో మొరార్జీదేశాయినే అందరూ విమర్శిస్తుంటారు కాని అది మంత్రివర్గం ఆమోదించిన తరువాతనే అమలులోనికి వచ్చిందన్న సంగతిని మరచిపోతుంటారు' అని అన్నాడు చంద్రలావు.

'అసలు గోల్డు కంట్రోలు విషయంలో యెవరు మాత్రం యేం చేయగలరు? అందరూ నిమిత్త మాత్రులు యెందుచేతనంటే దానికి విశ్వామిత్రుని శాపం ఉంది' అన్నాడు చూడామణి.

'ఏమిటా శాపం ?' అని చంద్రలావు, చిదంబరం ఒకేసారి ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

దేవసుందరి కథ

భూలోకంలో ప్రపంచ సుందరి పోటీలు జరుగుతున్నట్లుగానే స్వర్గంలో దేవసుందరి పోటీలు జరుగుతుండేవి. ఇక్కడ ప్రపంచ సుందరిని నిర్ణయించినప్పుడు ఉదా హరియా విషయంలో జనరల్ వారెడ్డిని కూడా పరి

శిలించినట్లుగా, దేవసుందరిని నిర్ణయించే టప్పుడు, పోటీ చేసేవారు అలంకరించు కొన్న వస్తువులకు ప్రాధాన్యతను యిచ్చే వారు.

అలాగ వస్తువులకు ప్రాధాన్యతను యివ్వ డానికి మరొక కారణం కూడా ఉంది. దేవత లందరూ త్రిదశులు. అంటే యెప్పుడూ ముప్ఫైయేళ్ళ వయస్సుతోనే ఉంటారు. లేదా మరొక అర్థంలో దేవతలకు బాల్యం, కౌమారం, యౌవనం అనే మూడు దశలే ఉంటాయి. వారికి వార్ధక్యం, మరణం ఉండవు. అందుచేత ప్రతి సంవత్సరం పోటీ చేసేవారు మారిపోవడానికి అవకాశం లేదు. ఆ పరి స్థితిలో మొదటిసారి పోటీలో యెవరునెగ్గితే ఆ తరువాత యెప్పుడూ వారే నెగ్గవలసి ఉంటుంది. అప్పుడు యీ పోటీల్లో యెవ రికీ ఆసక్తి ఉండదు. కాబట్టి శరీర సౌందర్యాన్నిబట్టి కాకుండా ధరించిన వస్తు వుల్నిబట్టి మాత్రమే ప్రతి సంవత్సరం దేవ సుందరిని నిర్ణయించేవారు.

రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ మొద లైనవారంతా యీ పోటీల్లో పాల్గొనేవారు కాని యెప్పుడూ రంభే నెగ్గుతుండేది. దాని కారణం ఆమె నలకూబరుడికి ప్రియురాలు కావడమే. నలకూబరుడు కుబేరుడికొడుకు. కుబేరుడు మూడు లోకాల్లోను ధనవంతుడు. కాబట్టి ప్రతిసంవత్సరమూ నలకూబరుడు యెంతో డబ్బు ఖర్చుచేసి రంభకు రకరకాల వస్తువులు చేయించేవాడు.

ఎప్పుడూ రంభే యీ పోటీలో నెగ్గడం మిగిలినవారందరికీ చాలా కష్టాన్ని కలిగిం చింది. ఊర్వశి, తిలోత్తమ మొదలైన వారందరూ కలిసి మేనకను ప్రోత్సహించేరు. 'నువ్వు తప్ప యీ పనిని మరొకరు సాధించ లేరు' అని ఆమెను పొగిడేరు.

మేనకకు కూడా రంభను ఓడించాలనే పట్టుదల అదివరకే ఉంది కాబట్టి 'ఏమైనా సరే యీ సంవత్సరం నేను రంభను ఓడిస్తాను' అని మేనక వారికి హామీ యిచ్చింది.

తరువాత మేనక యీ విధంగా ఆలో చించింది. రంభ గెలవడానికి కారణం ఆమెకు నలకూబరుడు యిచ్చే వస్తువులే. రంభను గెలవాలంటే అంతకంటే మంచి వస్తువులు కావాలి. దేవతల్లో నలకూబరుడికంటే ధన వంతులు లేరు. త్రిమూర్తులు మనకు అందుబాటులో లేరు. అని అనుకొని మాన వుల్ని గురించి ఆలోచించింది. సృష్టికి ప్రతి సృష్టి చేసున్న విశ్వామిత్రుడు ఆకస్మాత్తుగా ఆమెకు స్ఫురించాడు.

వెంటనే మేనక భూలోకానికి వచ్చి విశ్వా మిత్రుని యెదుట తన హావభావాల్ని ప్రద ర్శించి అతన్ని ఆకర్షించింది. విశ్వా మిత్రునితో మేనక మొత్తం పదిసంవత్స రాలు కాపురం చేసింది. మొదటిసంవత్సరం విశ్వామిత్రుడు యిచ్చిన ఆభరణాలను ధరించి మేనక దేవసుందరి పోటీల్లో పాల్గొని నెగ్గింది.

ఇదేదో కాకతాళీయంగా జరిగిందనుకొని రంభ ఊరుకొంది కాని వరుసగా మేనక యెని మిదిసంవత్సరాలపాటు దేవసుందరి పోటీల్లో నెగ్గడంతో రంభకు చాలాకోపం అవమానం కలిగేయి. ప్రతిరోజూ రంభ నలకూబరుడితో చెప్పి తొమ్మిదవసంవత్సరం పోటీలకు చాలా ప్రత్యేకంగా నగలు తయారు చేయించుకొని పోటీలో పాల్గొంది కాని మేనక వస్తువుల ముందు రంభ వస్తువులు వెలవెలపోయేయి.

దానితో రంభకు చాలాకోపంవచ్చి 'మీ రేమో యీ మూడు లోకాల్లోను నాకంటే ధనవంతులు లేరంటారు కాని మీరు యెంతో పొగడి నాకు యిచ్చిన వస్తువులు మేనక ధరించిన వస్తువులముందు ఎందుకూ పనికిరాకుండా పోయేయి' అంటూ నల కూబరుణి దెప్పడం ప్రారంభించింది.

'చూడు రంభా! క్షీరసాగర మథనసమ యంలో ఆవిర్భవించిన 'శంఖం' 'పద్మం' 'మకరం' మొదలైన నవనిధుల్లోనుంచి తీసిన అసలు రత్నాలతోనే నీ నగలు చేయిం చాను. ఈ మూడులోకాల్లోను యింతకంటె మంచి రత్నాలు ఉండడానికి అవకాశంలేదు. అందుచేత నీ వస్తువులకంటే కూడా మేనక వస్తువులు ప్రకాశిస్తున్నాయంటే ఆ నగలు కేవలం భూమిపైవనుసరుకే అయిఉండాలి అని అన్నాడు నలకూబరుడు.

దాంతో రంభకు తన పరాజయకారణం బోధపడింది. వెంటనే యీ సంగతి మేనకకు చెప్పడానికి బయల్దేరదామని రంభ నల కూబరుణ్ణి ప్రోత్సహించింది.

'నువ్వు దేవసుందరి పోటీల్లో గెలవ వచ్చును లేదా ఓడిపోవచ్చును. కాని నేను మాత్రం యీ వ్యవహారంలో కొంచెం కూడా జోక్యం చేసికోను. మనం యీ విషయం మేనకకు చెప్పేమని విశ్వామిత్రునికి తెలిసిం దంటే అతనునిన్నూ నన్నూ కూడా శపి స్తాడు.' అని నలకూబరుడు రంభకు స్పష్టంగా చెప్పి వేశాడు.

అటుపైన యేం చెయ్యాలో తోచక రంభ చాలాసేపు ఆలోచించగా ఆమెకు కలి జ్ఞాపకానికి వచ్చేడు. వెంటనే రంభ వెళ్ళి కలిని ఆశ్రయించింది. కుబేరుడు ఐశ్వర్యానికి అధిపతి అయినట్లుగానే కలి దరిద్రానికి అధిపతి. అందుచేత కుబేరుడికీ కలికీ సహజవైరం ఉంది. అటువంటప్పుడు తన శత్రువు యొక్క కుమారుని ప్రియు రాలు వచ్చి తనను ఆశ్రయించిందనగానే కలికి చాలా సంతోషం కలిగి 'నీకేంకావాలో కోరుకొమ్మ'న్నాడు. జరిగిందంతా పూస గ్రుచ్చినట్లుగా చెప్పింది రంభ.

'ఎలాగైనాసరే తను ధరించిన వస్తువులు భూమిపైవను వస్తువులేనని మేనకకు తెలిసే లాగున చేయాలని రంభ కలిని బతి మాలింది. రంభ మాటలు కాదనలేక కలి భూలోకంలో మేనకా విశ్వామిత్రులు కాపురం ఉన్న ప్రదేశానికి వచ్చి తగిన సమయంకోసం కాచుకొని ఉన్నాడు.

విశ్వామిత్రుడు యెక్కడకో వెళ్ళిన సమ యంలో మేనక ఆడపిల్లను ప్రసవించింది. స్నానం చేయడంకోసం మేనక వస్తువుల నన్నింటిని తీసి, నీళ్ళ పొయ్యిపక్కను ఉంచి, స్నానానికి వెళ్ళింది. ఇదే సమయమనుకొని కలి పిల్లిరూపంలో వచ్చి వస్తువులమీదుగా దాటి వెళ్ళిపోయేడు. ఆ దాటడంలో ఒక గొలుసు వెళ్ళి పొయ్యిలో పడింది.

మేనక స్నానం చేసివచ్చిన తరువాత వస్తు వుల్ని చూడగా ఒక గొలుసు కన్పించలేదు. దానికోసం ఆ చుట్టుపక్కల వెదుకగా అది మండుతున్న పొయ్యిలో కన్పించింది. మేనక వెంటనే దాన్ని బయటకుతీసి చూడగా దాని గిల్టుపోయి రాగి బయటపడింది.

దానితో మేనకకు విశ్వామిత్రుడు యిస్తున్న వస్తువుల గుట్టు తెలిసిపోయింది 'దేవలోకంనుంచి యిక్కడకు వచ్చి కాపురం చేయడం యీ గిల్టు వస్తువుల కోసమా?' అని మేనక ఆ వస్తువులను పిల్లనుకూడా అక్కడే వదలివేసి దేవలోకానికి వెళ్ళి పోయింది.

తరువాత కొద్దిసేపటికి విశ్వామిత్రుడు

(63 వ పేజీచూడండి)



# సందేహం?

పద్మనాభం

మీకు ఆత్మబలంగొప్పదా, గుండెబలం గొప్పదా, ధనబలంగొప్పదా—ఈ మూడింటిలో ఏది గొప్పదో చెప్పండి చూద్దాం?

బి. నేతాజీ, కొత్తగూడెం.

**ఆమాత్రం బుద్ధిబలం వుంది. 'ఆత్మబలమే' గొప్పది.**

భక్తిమార్గము గొప్పదా? యుక్తిమార్గము గొప్పదా?

టి. విమల, గోపాలపట్నం.

**యీ రెండింటికంటె భక్తిమార్గము గొప్పది.**

ఈరోజుల్లోమంచికి, నీతికి, నిజాయితీకి,న్యాయానికి స్థానంలేదు ఎందుకు?

యస్. హనుమంతరావు, బందరు

**ధర్మం మూడు పాదాలమీద నడుస్తోంది నాయనా!**

మీరు కార్టూన్ చిత్రాలను ఎందుకు నిర్మించకూడదు?

కె. కె. మండాల, పామిడి.

**తగు సందర్భాలకోసం కాచుక్కూచున్నాను.**

పేదవారికోపం పెదవికి చేటు. మరి ధనవంతుల కోపం.........?

యస్. లోకేశ్వరి, అనకాపల్లి

**ధనవంతుల కోపం దరిద్రులకు చేటు.**

ఎన్నోసందేహాలు—మిమ్మల్ని అడగాలంటే సమయానికి ఒక్కటే జ్ఞాపకానికి వచ్చిచావదు, ఎందుకు?

డి. వెంకటేశ్వరరావు, నైవేలి—3.

**'శీర్షాసనం' వెయ్యండి జ్ఞాపకశక్తి బాగా వుంటుంది.**

ఒకవేళచిత్రాలలో ముద్దులు ప్రవేశపెడితే యీ తారలు అందుకు సిద్ధపడతారా? మీ అభిప్రాయం?

బండారుకృష్ణ, హైదరాబాద్—23.

**మనల్ని పరిపాలిస్తున్న పెద్దలు ఎన్నో నిషేధాలను అమలులో పెడుతున్నారు. పొరబాటున 'ముద్దులే' ప్రవేశపెడితే సూదిదారంతో తారల మూతులే కుట్టమని రాజ్యసభలో చట్టం పాస్ చేస్తారు.**

ఒక అమ్మాయిని సోదరిగా భావిస్తున్నా. ఆమెను అపార్థంచేసుకుంటారెందుకండీ?

పి. జగేష్, జనగామ.




మీ 'పరసనాలిటీ' రాక్షసుడిలా **వుంటేనో?**

స్త్రీ లేకుండా సినిమా తీయడం సాధ్యంకాదా? అలాంటి చిత్రం తీయగల సమర్థులు తెలుగుసినిమా రంగంలో లేరా?

శ్రీరామసుదర్శనం, హైదరాబాద్.

**స్త్రీ లేకుండా ఉండకలిగిననాడు స్త్రీ లేకుండా తియ్యవచ్చు.**

ప్రతివాడు పరస్త్రీని చూసేందుకే ప్రయత్నిస్తాడు. కాని, అదేపరిస్థితి తన స్త్రీకి సంభవిస్తే సహించలేడు, ఎందుకు?

పి. లక్ష్మణరావు, గుంటూరు.

**అందుకే తనతప్పు తనదాకా వచ్చేటంతవరకు తెలియదంటారు.**

మీరు ఎప్పుడైనా నిజాన్ని అబద్ధంగా, అబద్ధాన్ని నిజంగా మార్చారా?

డి. కె. శ్రీధర్, అనంతపూర్.

**అలా మార్చడానికి నేనేమన్నా కోర్టు పక్షినా?**

కొన్నిపరిస్థితులలో మనిషి నవ్వటానికి ప్రయత్నించినా నవ్వలేడు, ఎందుకు?

టి. శంకరరావు, బరంపురం.

**తన ఓపికంతా ఏడవడంతోటే సరిపోయివుంటుంది, యిక నవ్వేశక్తి ఎక్కడిదీ?**

స్త్రీ తనుప్రేమించిన పురుషుని వివాహముచేసుకుని సుఖపడగలదా? పురుషుని చేత ప్రేమించబడిన స్త్రీ ఆతనిని వివాహముచేసుకొని సుఖపడగలదా?

వినసగిరి కృష్ణకుమారి, డోర్నకల్.

**ప్రేమ ఏ ఒక్కరికివున్నా లాభం లేదు. ఇద్దరికి వుండవలయును, అప్పుడే సత్యసుఖములను బడయవచ్చు.**

మీరు ఏనాడైనా సినిమాలనుండి విరమిస్తే ఏం చేయాలనుకుంటున్నారు?

శ్రీమతి వి. లక్ష్మీరాజా, బళ్ళారి.

**సినిమాలు విరమిస్తే డ్రామాలు మొదలుపెడదామనుకుంటున్నాను.**

ముచ్చటగా మూడుగంటలసినిమాచూసి, మూడు నిమిషాల జాతీయగీతం విననివారిని శిక్షించే అర్హత మన ప్రభుత్వం వారికి లేదంటారా?

కె. వి. భవానీదేవి, సర్వారెడ్డిపల్లి

**శిక్షించి దేశభక్తిని ప్రభోదిస్తే అది రావణరాజ్యం అవుతుంది కాని రామరాజ్యం ఎలా అవుతుంది?**

మీరు మీ జీవితంలో ఎవరికైనా ప్రేమలేఖ రాశారా? ఎం.డి. గౌస్‌మొహిదిన్, అల్లూరు

**వ్రాస్తే చెప్పులషాపు పెట్టుకోవలసి వస్తుందని అలాంటిపని చెయ్యలేదు.**

బతుకుని బట్టి విలువ మారినట్టు వేషాన్నిబట్టి గౌరవంలభించినట్టు మనస్సునిబట్టి భవిష్యత్తు మారుతుందని నా వుద్దేశం. మీ అభిప్రాయం?

ఎం.వి. శ్రీనివాసరావు, విశాఖపట్నం

**మీ అభిప్రాయమే నా అభిప్రాయం.**

జనసంఖ్యతగ్గాలని మనవాళ్ళు ఎన్నికుటుంబ నియంత్రణ పద్ధతులు ప్రవేశపెట్టినా—జనసంఖ్య పెరుగుతున్నదేకాని, ఏమాత్రం తగ్గటంలేదు. ఎందుకు? ఎస్. జయరామిరెడ్డి, తాడిపత్రి

**ప్రకృతిని అరికట్టడం బ్రహ్మతరమే!**

మనిషిని ఏడ్పించటం సులభమా, నవ్వించటం సులభమా?

ఎన్. నరసింహమూర్తి, అనంతపురం

ఎందుకండీ ఎప్పుడూ ఏడిపిస్తారూ?

అది సులభమోయ్

**ఏడ్పించటమే సులభం.**

మానవజన్మ ఎత్తడమే మహాపుణ్యమన్నారు కొందరు, కాని మానవజన్మ ఎత్తినవారు పోయినజన్మలో పాపము చేసినవారని కొందరన్నారు. ఇందులో ఏది నిజం? పి. మోహన్‌బాబు, నంద్యాల.

**ఏది నిజమో చెప్పడం కష్టం. వూహాగానానికి వదిలేస్తే ఏ నష్టం వుండదు.**

స్త్రీ ఆదిశక్తి సృష్టికర్త అంటారుకదండి మరి పురుషులకు లొంగి ...నికి కారణం ఏమిటి? పురుషులే స్త్రీకి లొంగివుంటే బాగుండును, కదండీ?

టి. భాను, పార్వతీపురం

**ఎవరు కాదన్నారు? కాలితో తన్నినా సత్యభామకు విధేయుడై ఉండలా శ్రీకృష్ణపరమాత్ముడు.**

భర్తను గౌరవించలేని భార్యను ఏమి చేయాలి?

ఎం. మురళి, కరీంనగర్.

బాబాయ్

**ఏం చెయ్యాలా? చేతనయితే ఆమెను నాలుగు తన్నడం, ఎదురు తిరిగితే పారిపోవడం.**

నటునికి వాక్శుద్ధి ప్రధానమంటారా, విగ్రహపుష్టి ముఖ్యమంటారా? ఏది అతనికి భవిష్యత్తును కూర్పగలుగుతుంది?

ఎం.వి.ఆర్.భాగ్యలక్ష్మి, ఉరవకొండ.

**వాక్చాతుర్యము ఒక్కటేవుంటే 'మాటకారి' అని అంటారు. యిక రెండవది 'విగ్రహపుష్టి నైవేద్యనష్టి' రెండు కలిగివుంటే భవిష్యత్తు దేదీప్యమానంగా వెలుగుతుంది.**

ఘోరపాపంచేసి, ప్రాయశ్చిత్తం అనుభవించి, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న ఒకవ్యక్తికి యీలోకంలో గల స్థానమేమిటి? ఎం. ప్రకాష్, కరీంనగర్.

**మనిషిగా బ్రతకడమే.**

## బహుమతిపొందిన ప్రశ్న

విద్యార్థికి సీటులేదు. విద్యాధికుడికి సరైన ఉద్యోగంలేదు. ఎందుకు?

ఎస్. భాస్కరరావు, అనకాపల్లి.

ఇరుకైన స్వాతంత్ర్యం ఎవరికుందోయ్

నిరుద్యోగండ

**మనకు స్వాతంత్ర్యం వచ్చిందిగా, ఏం లేకపోతే ఎలా?**

మీ తరువాతి చిత్రంలో నేను హీరోగా, మీరు విలన్‌గా పిక్చర్ తీస్తే ఎలా వుంటుందిగురూ?

ఎం. సి. ప్రకాశరావు, హైదరాబాద్

**శిష్యా! అదే నీకోరికైనచో డబ్బు పెట్టుబడి నీవే పెట్టుము. అప్పుడు నేను విలన్‌గా నటించెదను. నీవు హీరోగా నటించి ఆ చిత్రాన్ని నీవే చూసుకుని ఆనందించుము.**

సినిమాలో హీరో – హీరోయిన్‌దగ్గరికి వస్తూంటే చీదరించుకొంటుంది. కసురుతుంది. ఆ తర్వాత 'నీవేనా రాజావు—నీవే నాకూజావు' అంటూ వడిచస్తుంది, ఎందుకు? బి. కృష్ణకుమార్, వడి.

**అదే 'Love' అదే 'ప్రేమ' అదే 'కాదల్' అదే 'మొహబ్బత్' అదే అదే అదే...**

పద్మనాభం

మ్యానం డ్యూటీనుంచి పద్మనాభంగారింటికని వెళ్తున్నప్పుడు — రాజ్‌బాబు హడావిడిగా తిరుగుతున్నాడక్కడ. 'ఏమిటోయ్ రాజ్ బాబూ, హడావిడి?' అని అడిగాను. 'పుష్కరాలకి రాజమండ్రిపోతున్నా. టాక్సీ కావాలి అర్జెంటుగా' వస్తాను మరి, శెలవు. అంటూ పరుగెత్తాడు. 'ఎప్పుడొస్తావ్ మళ్లీ!' 'వచ్చేవారం ఎం. వి. ఆర్ పిక్చర్స్ షూటింగ్‌వుంది' అన్నాడు వెనక్కి తిరిగి... హాస్యనటుడుగా రాజ్‌బాబు యిప్పుడు చక్కని పేరు తెచ్చుకొంటున్నాడు.

*        *        *

కిందటి వారం హైదరాబాద్‌నుంచి శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి మద్రాసు వచ్చారు — తమ కొత్త చిత్రనిర్మాణం విషయాలను నిర్ణయించుకునేందుకు. 'అన్నీ ఫిక్సయినట్టే కెమెరామన్ విషయం తప్ప. నవంబరునుంచి షూటింగ్ ప్రారంభించాలని అనుకొంటున్నాం' అన్నారు తమ్మారెడ్డి. నాయకీనాయకులు జయలలిత, నాగేశ్వరరావు. సి. యస్. రావు దర్శకుడు. రాజశ్రీ కథకుడు, పినిశెట్టి సంభాషణల రచయిత.

— మోహన్‌కుమార్ ●

---

## మెదడుకి మేత

(15 వ పేజీ తరువాయి)

ఉన్నప్పుడు ఎత్తువెయ్యవలసినది ఈగ అవుతుంది. ఇంక అక్కడి నుంచి పోలీసు తిన్నగా ఈగ వైపు దండెత్తిపోయి, కొద్ది ఎత్తులలో పట్టివేయగలదు.

ఈ కిటుకు ఈగకు తెలిసినప్పటికీ పోలీసు చేతిలో దానికి చావు తప్పదు. ఈ ఆటను ఇంకా రకరకాలుగా తయారు చేయవచ్చు. బొమ్మలో త్రిభుజానికి బదులు పంచభుజి, సప్తభుజి వంటి బేసి భుజములు గలవాటిని గీయవచ్చు. వాటి సంఖ్యకూడ కటి కన్న ఎక్కువ ఉంచవచ్చు. ఈగకూ, పోలీసుకూ, కూడా ఈ బేసి భుజముల చుట్టూ తిరిగే అవకాశాలు కల్పించవచ్చు. ఆ బేసి భుజములను ఇన్నిసార్లు కన్న అధికంగా తిరిగి రాకూడదన్న నియమం పెట్టుకోవచ్చు. ఈ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని రకరకాల సమస్యలు, ఆటలు తయారు చేయవచ్చు. ●

ఒకవారం విపరీతం

# తనయుని హత్యచేసిన తల్లిదండ్రులు

మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి చెందిన ఓ అధికారి, ఆయన భార్యా తొమ్మిదేండ్ల వయసుకల తమ నాలుగో కుమారుని హత్య చేసినందుకు యం.పి.ల పోలీసులు వారిని అరెస్టు చేశారు.

బస్తర్ జిల్లాలోని జగదల్‌పూర్‌కి నలభై మైళ్ళదూరంలో గల దాంతేవాడలో ఈనెల తొమ్మిదో తేదీ రాత్రి ఈ దుర్ఘటన జరిగింది. ఆదిమజాతుల సంక్షేమ శాఖకి ప్రభుత్వం కోరి పైన పంపిన ఈ అధికారి ఆ జాతుల వారి ఆచారాలను నమ్మి, తమ కుమారుని బలిఇచ్చారట.

బాలుని చావుకేకలని విన్న ఇరుగు పొరుగువారు, పోలీసువారు ఆ ఇంటితలుపు బయట తాళం వేసి ఉండటాన తలుపులు పగలగొట్టి లోపలికి ప్రవేశించారు. పూజా గృహంలో చనిపోయిన బాలుడు వారికి కన్పించాడు. తమకుమారుడు ఆరుగంటలలో పునర్జీవితుడవుతాడని ఆ దంపతులు అన్నారట. కానీ బాలుని మృతదేహాన్ని పరీక్షించిన డాక్టర్లు మాత్రం గొంతునులిమి వేయడం వల్ల బాలుడు మరణించినట్లు తేల్చారు.

* * *

సంయుక్త అరబ్ రాజ్యాల సైనికదళాల మాజీ డిప్యూటీ సుప్రీమ్ కమాండర్ శ్రీ అబ్దుల్ హకీమ్ అహమ్మద్ ఆత్మహత్య చేసుకున్నారని ఈ నెల 15న కైరో రేడియో ప్రకటించింది. అధ్యక్షుడు నాజర్‌ని వ్యతిరేకించినందున యు.ఏ.ఆర్.ల ఆయన్ని అరెస్టు చేశారు.

— ఎం. ఆర్.

## కంచే చేనుమేస్తే...

ఢిల్లీలో రహస్య క్లబ్‌లో చట్టనిషేధమైన పేకాట ఆడుతున్నారని పట్టుకోడానికి వచ్చిన పోలీసులు చట్టపు ఇనప్పెట్టెలో నుంచి ఓ వెయ్యి రూపాయలు తస్కరించారట!

ఇంఫాల్లో పోలీసు కానిస్టేబుల్స్ ఇద్దరు ఒక వ్యక్తిని అటకాయించి, అతని జేబులో వున్న రెండు వేల రూపాయలూ స్వాధీన పరచుకున్నారట! ఆనక ఆ ఇద్దర్నీ వారి శాఖే అరెస్టు చేసింది— తలలు బోడైన తలపులు బోడా అని అలనాడెవరో అన్నట్టు వాళ్ళు వేసుకునే దుస్తులకూ, మనోభావాలకూ పొత్తు కుదరాలని రూలేముంది? అవును లేదు.

## ముక్కుమీదా కోపం!

మనుష్యుల్లో కొన్ని గుణాలుంటాయని డార్విన్ దానికన్నా తక్కువ గుణాలుంటాయంటే నిజానికో మెట్టు వారగా వుంటుంది—తన భార్య ముక్కు కొరికి, వూడదీసిన నేరానికి పంచమహల్ జిల్లాలో ఒకతన్ని అరెస్టు చేశారు. భార్యని ఆసుపత్రిలో చేర్చారు. ఇద్దరూ చెరో పార్టీకి వోటు చేసి, ఇంటికి వచ్చి ఘర్షణ పడ్డారట. దాని ఫలితం అది.

## దాగుడు మూతలు

ఢిల్లీలో ఓచోట రోడ్డు మీద పోతున్న ఒకతన్ని ఓ నలుగురు ఎత్తుకుపోయారట. రోడ్డు మీది జనం పోలీసులకు రిపోర్టు ఇస్తే—పోలీసులు ఆ టాక్సీని వెంబడించి చచ్చీచెడి పట్టుకునేసరికి 'థాంక్స్' చెప్పాల్సిన ఆవ్యక్తి విసుక్కుని ''మేమంతా స్నేహితులం. నన్నేం వాళ్ళు ఎత్తుకుపోవటంలేదు — ఇదంతా సరదా'' అని విరుచుకుపడ్డాడట! —అయితే వాళ్ళు ఎత్తుకుపోతున్నప్పుడు అతను పెనుగులాడాడనీ, అరిచాడనీ, రోడ్డు మీది జనం అన్నారట.

* * *

హాంగ్‌కాంగ్ నుంచివస్తున్న విమానం ఇంజను ఇబ్బందివల్ల పాలం విమానాశ్రయంలో 15 తేదీన ఆగిందట. ఆలోగా కస్టమ్స్ శాఖవారు అనుమానించి, ఆ విమానంలో సుమారు ముప్ఫయిమణుగుల బంగారం వుండితీరాలనుకుని సోదా ప్రారంభించారట. ఆ బోయింగ్‌లో ప్రయాణం చేస్తున్నవారు వేర్వేరు విమానాల్లో వెళ్ళిపోయారట.

## కోరినవిచ్చే వృక్షమా!

జయపూర్‌లో నాలుగైదు వేల సంవత్సరాల నాటి కల్పవృక్షం ఒకటి వుందట. అది బహుశా పాండవుల నాటిదై వుండవచ్చని అభిప్రాయపడుతున్నారు. దీనికి విత్తనాలు లేనందున యీ వంశం మరెక్కడా లేదట! వృక్షం మొదలు క్వీన్సైజ్ కలిగి వుందనీ, చెట్టు పైపొర కరెన్సీ అచ్చువేసే కాగితంగా వుపయోగించవచ్చన్నీ విజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. ఈ కల్పవృక్షం కోరిన వరాలిచ్చేదని ప్రసిద్ధిట! దీని పూవులు రాత్రి ఎనిమిది, పది గంటల మధ్యనే వికసిస్తాయట!

—ఫాలాక్షుడు.



## ముగ్గురు మూర్ఖులు

(55-వ పేజీ తరువాయి)

యింటికిరాగా మేనక యెక్కడా కన్పించ లేదు. అప్పుడు విశ్వామిత్రుడు దివ్యదృష్టితో కలి చేసిన ద్రోహాన్ని తెలిసికొని కలిని యీ విధంగా శపించాడు.

'ఓరీ కలి! నేను యిచ్చిన వస్త్రాలను గిల్టు వస్తువులని రుజువుచేసి నా మేనకను నాకు దూరం చేశావు కాబట్టి నీ కాలంలో అనగా కలియుగంలో గోల్డు కంట్రోలు అమలులోనికి వస్తుంది. ఆ తరువాత ప్రజ లందరూ యీ గిల్టు వస్తువులను ధరించెదరు గాక!

అని చూడామణి కథ పూర్తిచేయగానే చంద్రరావు తన సందేహాన్ని యిలాగ వెలి బుచ్చాడు.

'సినిమాల్లో ఒక సీనులో మేనక విశ్వామిత్రుని యెదుట నాట్యం చేసినట్లు తరువాత సీనులో మేనక పిల్లను కన్నట్లు చూపిస్తారు. దానివల్ల మేనక విశ్వామిత్రులు కలిసిఉన్నది చాలా కొద్దికాలమే నని మేం అనుకొంటున్నాం. నీవేమో మేనకా విశ్వామిత్రులు పదిసంవత్సరాలు కాపురం చేశారంటున్నావు. ఇందులో యేది నిజం?

విశ్వామిత్రునితో మేనక పదిసంవత్సరాల పాటు కాపురం చేసిందని నేను అనడంలేదు. వాల్మీకిరామాయణంలో బాలకాండలో అరవై మూడవసర్గలో యెనిమిదవ శ్లోకం ఇలాగ ఉంది.

శ్లో॥ తస్యాం వసంత్యాం వర్షాణి
పంచ పంచచ రాఘవ
విశ్వామిత్రాశ్రమే రామ
సుఖేన వ్యతి చక్రముః॥

'ఆమె (మేనక) విశ్వామిత్రుని ఆశ్రమ మందు ఉండగానే సుఖముగా పదిసంవత్సరాలు గడచిపొయి'

అందుచేత యిది నా కల్పితం యేమీ కాదని చూడామణి సమాధానం యిచ్చాడు.

ఇక మనం యింటికి 'పోవచ్చునం'టూ చంద్రరావు లేవగానే మిగిలిన యిద్దరూ కూడా అతన్ని అనుసరించేరు. ●

20—9—67

# న్యూఢిల్లీ లేఖ

(6 వ పేజీ తరువాయి)

రయిట్ కాన్ఫరెన్స్‌కు వెళ్లారు.

### ప్రజల డబ్బుతో మంత్రుల విహార యాత్రలు

'దోపిడీ'ని ప్రస్తావించు కొంటున్నప్పుడు రాజా దినేష్‌సింగ్‌గారి పేరు ఉచ్చరించక పోతే పాపం! రెండోసారి ఆయన విదేశాలకు వెళ్లబోతున్నారు. బేంక్‌కాక్, అల్జీరియా, జెనీవాలను దర్శించి వస్తారన్నమాట. వారి భాంయీసాహెబ్ గారొకరున్నారు. ఆయన మియాం ఫక్రుద్దీన్ ఆలీఅహ్మద్‌గారు. వారు ఇప్పుడు విదేశ పర్యటనలోనే వున్నారు. కెయిరో, బెల్‌గ్రేడ్, పారిస్, లండన్, మాస్కోలను సందర్శించి వస్తారు. కార్మికమంత్రి జయ్‌శుక్లాల్ హాథీ రష్యావెళ్లి చాలరోజులయింది. సోవియట్ పనివారికి 'ఘెరావ్'ల గురించి బోధించి ఆయన తిరిగి వస్తారు! మరి, రష్యా చూస్తే చాలా వెనుకబడిన దేశం. అది మననుంచి నేర్చుకోవలసినది చాలావుంది!

విహారయాత్ర వైమానికశాఖకి సంబంధించిన మంత్రివర్యులు మాస్కో, లండన్, న్యూయార్క్, మాన్‌ట్రీల్ యాత్రచేసి వచ్చారు. డా. కరణ్‌సింగుగారు ఉభయదేశాల మధ్య ప్రజల రాకపోకల్ని అధికం చేయడం కోసం విదేశం వెళ్లారు!

కేంద్ర రవాణామంత్రి కూడా మాస్కో, లండన్ వగయిరాలను దర్శించడానికి ఆయత్తమవుతున్నారు. ఈ వయిద్యకోవిదులు తమకు ఆతిథ్య మిచ్చిన దేశాల్లో 'పోర్టు' సదుపాయాల గురించి, కాయకష్టం గురించి నూరిపోస్తారు!

రక్షణమంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్‌గారు కూడా మాస్కోకి వెళ్లమన్నారు. ప్రధాన మంత్రిని విడిచిపుచ్చితే ఎలా? సిలోన్‌కి వెళ్లిరాగానే కొన్ని తూర్పు అయిరోపా దేశాల్ని, మాస్కోని దర్శించాలని వారి కోరిక.

ఈ మంత్రివర్గం మేళమంతా మాస్కోలో అంబారీ లెక్కి కూర్చుంటే డిప్యూటీ మంత్రులేం తీసిపోయారా? సమఉజ్జీగా టోక్యో, లండన్, వాషింగ్‌టన్, బాన్‌లకు వెళ్లి ఒక 'షైర్' కొట్టివస్తారు. మొరార్జీ దేశాయ్‌గారు వారి కుమారుడ్ని తీసుకువెళ్తే ఫక్రుద్దీన్‌గారు భార్యామణితో యూరప్‌లోని ఏడు రాజధానుల్ని దర్శించారు. సందర్భవశంగా ఇక్కడ మనం ఒక విషయం అనుకోవాలి. ఈ మంత్రులు, ఉపమంత్రుల సెలవుదినాలన్నీ బోల్డంత డబ్బుతో పని! ఫక్రుద్దీన్‌గారు ఒకరోజు పారిస్‌లోను, నాలుగురోజులు లండన్‌లోను గడపడానికి వెళ్లారు కదా! అప్పుడు, దేశంలో పారిశ్రామిక అభివృద్ధి గురించిగాని, తిర్యగ్గమనం యొక్క పర్యవసానంగాని ఆయనకు పూర్తిగా అర్థమయిందా అని? నాలుగు రోజుల్లో ఆయన ఏంచేయగల్గుతారు? ఇక్కడ ఒక నగ్నసత్యం బయటికి వస్తోంది. ఫక్రుద్దీన్‌గారు దేశక్షేమంకోరి విదేశం వెళ్లలేదు. తమ ఆరోగ్యాన్ని సరిచూపించుకోడానికి వెళ్లారు. శ్రీమతి గాంధిగారి వంటింటి సామ్రాజ్యంలోని సభ్యుడు గనక ఆయన కెయిరో, బెల్‌గ్రేడ్‌లు వెళ్లి కలనల్ నాసర్, మార్షల్ టిటోలతో చేతులు కలుపుతారు. మాస్కో వెళ్లడమనేది తప్పని సరే అయింది!

శ్రీమతి గాంధీ ఇంకొక ఘనకార్యం నిర్వహించారు. ఒక ఆజెండా అంటూ లేకుండా, విశేషాలని కాగితంమీదికి ఎక్కించకుండా, శ్రీమతి గాంధీ ఒక 'మహామహత్తరమయిన' మంత్రివర్గ సమావేశాన్ని ఏర్పరచారు. (బహుశా దానికి అధమపక్షం హాజరు కావలసిన సంఖ్య కూడా వుండివుండదు!) ఇది మంత్రి మండలితో శ్రీమతి గాంధీగారి రవుండ్ టేబుల్. అది మొరార్జీ దేశాయ్‌గారిని వెలివేసినంత పనిచేసింది!

ఉప ప్రధానమంత్రిగారికి మంత్రివర్గం నుంచిగాని, శ్రీమతి గాంధీగారి నుంచిగాని, తగినంత చేదోడు లభించడంలేదన్నది సత్యం. స్వతహాగా కొంత విలువ పోగొట్టుకున్నారు. కేంద్ర ఉద్యోగుల కరువుభత్యం విషయం అందుకు ఉదాహరణ. ఆయన తతిమా పథకాలు కూడా పలుకుబడి లేకుండా చీకట్లోకి పోతాయనుకోవడంలో సందేహం అక్కరలేదు. టి. టి. కృష్ణమాచారిగారు ఏవగించుకున్న 'యాన్యూటీ డిపాజిట్' మాత్రమే అమల్లోకి రాగల్గింది. దేశాయ్‌గారు తుఫానులో నడిసముద్రంలో ప్రయాణం చేస్తున్నారు. వాతావరణాన్ని దృష్టిలో వుంచుకొని ప్రయాణం చేస్తే ఆయనకు మేలు! ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

